శుభమస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# ఆంధ్ర భగవద్గీత.

గీ॥ శ్రీసదాశివతత్వంబు జింతచేసి । సచ్చిదానందరూపంబు సంస్మరించి । సగుణమూర్తులభజనంబు సలిపి వారి । యాజ్ఞగొని భగవద్గీత నాంధ్ర భాష । తేటగీతలలో వ్రాసి తేటపరుతు । భక్తజనముల దీవనల్బడయ గోరి । బ్రహ్మజిజ్ఞాస గల్పించె భారతమున । గీతలను వేదసారంబు గీలుకొల్పి । వాసుదేవుడు శ్రీకృష్ణనరదుబోలు । పరమకారుణికుండను గురుడుగలడె? । మహితభార్గవగోత్ర సంభవుడనేను । పార్వతీశ్వరుభక్తుడ బ్రాహ్మణుండ । నమ్ము వంశజుడను సోమయాహ్వయుండ । దప్పులున్నను మన్నించి యొప్పులరసి । తనివితీరగ గీతామృతంబు బుధులు । గ్రోలెదరుగాక గోపాలబాలు కృపను.

## ప్రథమాధ్యాయము.

ధృ— గీ॥ ధర్మభూమి కురుక్షేత్ర తలమునందు । పాండవులు మామకులు గూడి బవరమునకు । ఏమిచేసిరి సంజయ యెరుగజెప్పు. ౧॥

సం— వ్యూహముగ నాయితంబయి యున్నయట్టి । పాండవులసేన నీకుమారుండు జూచి । కడసి యాచార్యునొద్ద వాక్యంబు పలికె॥ ౨॥

దు— ధీమతియు నీదుశిష్యుడు ద్రుపదసూను । డాలమొనరింప బన్నిన యధికమైన । పాండవానీకమాచార్య పరిగణింపు ॥ ౩ ॥ కలరచట

శూరులు మహాస్త్రకౌశలమున । భీము నర్జునుబోలెడివీరవరులు ।
సాత్యకియు విరటుండు పాంచాలరాజు ॥ ౪ ॥ ధీరుడగు కాశిరాజును
దృష్టకేతు । చేకితానులు శైబ్యుడన్నృపతి । కుంతిభోజుండు
పురజిత్తనంతబలులు ॥ ౫ ॥ వీరుడగు యుధామన్యువు వీరవరుడు ।
ఉత్తమౌజస్సుద్రౌపదేయులు సుభద్ర । పుత్రుడతిరథుల్ వీరంత భూరి
బలులు ॥ ౬ ॥ నామసైన్యంబునందలి నాయకులను । వినుము వేర్వేర
దెల్పెదవిప్రవర్య ॥ ౭ ॥ నీవు భీష్ముండు కర్ణుండు నీసుతుండు । కృప
వికర్ణులు మఱియు భూరి శ్రవుండు ॥ ౮ ॥ అన్యులశూరు లెందఱో
యాజివిదులు । విడువనున్నారు జీవముల్విభునికొఱకు ॥ ౯ ॥ మన
బలమనంతమౌ పితామహునిచేత । పాలితంబౌట పాండవబలము
భీము । పాలితంబౌట సంపూర్తి బడయదయ్యె ॥ ౧౦ ॥ మీరలందరు
నియమించు మేరలందు । స్థిరముగనునిల్చి భీష్ము రక్షింత్రు గాక ॥
౧౧ ॥ కురువృద్ధుడంత నతనికి కుతుకమొలయ । సింహనాదంబు జేసె
విశేషముగను । మరియు శంఖంబుపూరించె గురువరుండు ॥ ౧౨ ॥
పిదపశంఖంబులొత్తిరి భేరులుతిమె । పణవగోముఖనాదముల్ బహు
ళమగుచు । తుములఘోషంబు మింటనుదోచె మిగుల ॥ ౧౩ ॥ తెల్ల
గుఱ్ఱములనుబూన్చు తేరునందు । బొల్చి మాధవుడును పాండుపుత్రు
డపుడు । దివ్యశంఖంబులొత్తిరి భవ్యయశులు ॥ ౧౪ ॥ పాంచజన్యం
బు కృష్ణుండు పార్థుడల్ల । దేవదత్తంబు పౌండ్రంబు ధీరబలుడు ।
భీమసేనుండు నొత్తిరి భీమముగను ॥ ౧౫ ॥ ధర్మజుడనంతవిజయంబు
దాల్చియొత్తె । క్రమముగను ఘోషమణిపుష్పకముల కవలు ॥ ౧౬ ॥
అధికధన్వంగి కాశీశుడతిరథుండు । సలశిఖండియు ననుజుండు నధిక
బలులు । విరటుడును సాత్యకి యమోఘవీరుడాజి ॥ ౧౭ ॥ ద్రుపదు
డును ద్రౌపదేయులు, దోర్బలమున । మేటి యభిమన్యుడండటు మేది

నీశు । లొత్తిరంతంతశంఖంబు లొప్పమీర ॥ ౧౮ ॥ తన్నినాదంబు
భీమమై ధార్తరాష్ట్రు । గర్భనిర్భేదమాచు నాకలకలంబు । మాఱు
మ్రోగెను మింటను మహినిబెరిగి ॥ ౧౯ ॥ శస్త్రసంపాతమంతట
సాగుచుండ । కేలధనువెత్తి వానరకేతనుండు । కౌరవులయాజి
సంరంభగరిమజూచి । యిట్లనుచుబల్కె నాహృషీకేశుతోడ ॥ ౨౦ ॥

అర్జున— ఉభయసేనలనడుమను నుంచుతేరి । నరసెదను నాజిసన్నద్ధు
లైనవారి । నేరితోడను నీరణమేను జేయ ॥ ౨౧ ॥ వలయునో యేను
దుష్టభూపాలుడైన । పాపి మర్యోధనునిపంపు ప్రమదమొప్ప । జేయ
నున్నారొ వారల శ్రీనివాస ॥ ౨౨ ॥

సం— ఇట్లు ఫల్గునుడన హృషీకేశుడంత । నుభయసేనల నడుమను
నుంచె తేరు ॥ ౨౩ ॥ ద్రోణభీష్మాది రాజయోధులకు నెదుట । తే
రిటులబెట్టి యిట్లనె, దేఱిచూడు । మాజిసన్నద్ధమౌ కురురాజుసేన ॥
౨౪ ॥ కాంచె నంతట పార్థుండు కదనభూమి । నుభయసైన్యంబు
లందున నున్నయట్టి । గురుల దండ్రుల దాతల గొమరులతతి ॥ ౨౫ ॥
భ్రాతలను మేనమామల పౌత్రసమితి । బావమఱదుల మామల బరమ
మిత్ర ॥ ౨౬ ॥ సముదయము జూచి యురుకృపాచలితుడగుచు ।
బల్కె నొకవాక్యమతిదీనభావమునను ॥ ౨౭ ॥

అర్జు— యుద్ధమున కాయితంబుగనున్న యీస్వజనముజూచిన శ్రీకృష్ణ!
చలనమొందు । చున్నయవి యవయవములు, శుష్కమగుచు ॥ ౨౮ ॥
నెండుచున్నది నానోరు, నీశరీర । మెంతయును గంపమొందెను, గుం
తలములు । నిక్కుచున్నవి, నా చేత నిలువలేక ॥ ౨౯ ॥ జారుచున్నది
గాండీవ చాపమిట్లు । మండుచున్నది దేహంబు, నుండలేను । స్యంద
నముమీద, నామది సంచలించె ॥ ౩౦ ॥ దుర్నిమిత్తములెంతయు దోచె
శౌరి । గాంచ శుభమాజిబంధుసంఘంబుజంపి ॥ ౩౧ ॥ జయముకా

మింప నో కృష్ణ! జగతియేల? । పదవి యదియేల? సుఖమేల? బ్రతు
కదేల? ॥ ౩౨ ॥ ప్రాభవము భోగసుఖము లెవ్వారికొఱకు । కాంక్ష
సేయుదు వారలీకదనభూమి । బ్రాణధనములవిడువంగ పాలుపడిరి ॥
౩౩ ॥ గురులు పితరులు తాతలు కొడుకులు మఱి । పౌత్రులును మేన
మామలు బావమఱదు । లాత్మబంధులు మామలు నరయనాకు ॥ ౩౪ ॥
వీరలను జంపగోరను వీరు నన్ను । చంపుచున్నను త్రైలోక్యసార్వ
భౌమ । పదవికైనను, భూలోకపదవికేట్లు? ॥ ౩౫ ॥ ధార్తరాష్ట్రు
లజంపిన దనివిదేమి? । ఆతతాయులజంపిన నఘమెవచ్చు ॥ ౩౬ ॥
కానబంధువులైన యీకౌరవులను । జంపగూడదు మాధవ! స్వజన
గణము । బొడిచి పిమ్మట సుఖమేమి పొందగలము? ॥ ౩౭ ॥ అరయ
గాలేరు లోభోపహతమనస్కు । లౌట వీరలు కులముల నణగద్రొ
క్కు । పాతకంబును మిత్రఘ్నపాతకంబు ॥ ౩౮ ॥ కులవినాశనదోషం
బు గుఱ్తెఱిగిన । మనము పాపమునకు బోక మరలవలయు ॥ ౩౯ ॥
చెడు సనాతనధర్మముల్ చెడినగులము । అవి చెడనధర్మమాకులమా
వరించు ॥ ౪౦ ॥ చెడు దురాచారహీనత స్త్రీజనములు । కాంతలు
ను జెడ వర్ణసంకరముగల్గు ॥ ౪౧ ॥ సంకరంబున నరకంబు సంభవిం
చు । చెడినకులమునకును దానిజేయువారి । కిని బడుచునుంద్రు నర
కమందున పితరులు । లుప్తపిండోదకక్రియాతప్తులగుచు ॥ ౪౨ ॥
మఱికులఘ్నులవర్ణసంకరదురితము । జాతి కులధర్మములబోలు శాశ్వ
తముగ ॥ ౪౩ ॥ నరులు కులధర్మములుబోవ నరకమందు । నియత
ముగనుందురనివిందు నీరజాక్ష! ॥ ౪౪ ॥ గొప్పపాపంబు జేయంగ
గోరుచుంటి । మకటా రాజ్యసుఖలోభహతులమగుచు । తమజనం
బుల జంపగ దలచుకతన ॥ ౪౫ ॥ ధార్తరాష్ట్రులు నాయుధధారు
లగుచు । నప్రతీకారు ద్యక్తశస్త్రాస్త్రునన్ను । జేరి చంపిరయేనియు,
క్షేమతరము ॥ ౪౬ ॥

సంజ— అనిభూమిని నిట్లని యర్జునుండు । బాణములతోడ ధనువును బారవిడిచి । కూలబడె స్యందనంబున, ఘోరశోక । సంచలితమాన సుండయి సవ్యసాచి ॥ ౪౭ ॥

ఇది యర్జునవిషాదయోగంబను ప్రథమాధ్యాయము.

## ద్వితీయాధ్యాయము.

సంజ— అవ్విధిం గరుణావిష్టుడౌచు, మిగుల । నశ్రుపూర్ణాకులేక్షణుఁడై, విషాద । మొందు, నర్జునుతోడ గోవిందుఁడనియె ॥ ౧ ॥

శ్రీభగ— ఈవిషయసమయంబున నిట్టికశ్మ । లంబెటులబొందె, నపకీర్తి దంబనార్య । జుష్టమస్వర్గ్యమర్జున! శూర! నిన్ను ॥ ౨ ॥ దరికిరానీకు మోహపార్థ! పిరికితనము; । కూడదదినీకు, విడువుమీక్షుద్రమైన । హృదయదౌర్బల్యమును, లెమ్ము కదనమునకు ॥ ౩ ॥

అర్జు— పూజ్యులౌ ద్రోణభీష్ములపోర నెదిరి । బాణముల నెట్లుగొట్టెదను, పాపహరణ! ॥ ౪ ॥ శ్రేయమిద్ధరభిక్షాన్నసేవనంబు । బూజ్యులౌ గురువుల నాజి బొడుచుకంటె । గురుల బురుషార్థకాముల, నరికి రక్త । సిక్తముల భోగముల, వాంఛజేరవలసె ॥ ౫ ॥ ఈయుభయమున శ్రేష్ఠంబు నెఱుగముగద । గెల్తుమో వారి, వారలే గెల్తురేమొ । ఎవ్వరిని జంపి జీవింపనిచ్ఛలేదొ । యట్టి కౌరవులెదురైరి, యాజిగోరి ॥ ౬ ॥ కొట్టె కార్పణ్యదోషంబు, కుటిలమయ్యె । నాస్వభావము, ధర్మనిర్ణయము సేయ । జాలదెంతయు, నామది, శరణు జొత్తు । శ్రేయమెద్ది యౌదానినిశ్చితము చేసి । చెప్పవే నీకుశిష్యుడ, దెలివిజెప్పి ॥ ౭ ॥ శోక

క్షితి యింద్రియంబుల శోషబెట్టు । చున్నయది, గాన శమనంబు,
నుంకులేని । సార్వభౌమత్వమందిన, స్వర్గమండ । లాధిపత్యంబు గాం
చిన నణగువినాశ ॥ ౮ ॥

సంజ— ఇట్లనుచు బలికి యాహృషీకేశుతోడ । నరికిమాపనుడర్జునుం
డహహ దేవ ! 'యుద్ధమును జేయనిక' నటంచూరకుండె ॥ ౯ ॥
అటులశోకాన భారత! యర్జునుండు । నుభయసేనలనడుమను నుడు
కుచుండ । చిరునగవుడోపనిట్లని చెప్పె శౌరి ॥ ౧౦ ॥

శ్రీభగ—కుందెదవు నీవు శోకింపకూడనట్టి । వారలనుగూర్చి, పండితవా
క్యములను । బలుకుచున్నావు, బుధులేరు, బ్రతికియున్న । వారలనుగూ
ర్చి, చచ్చిన వారిగూర్చి । యెన్నడును శోకమును బొందరర్థచరిత ॥౧౧॥
ఉండ, లేకుండ, నే నెప్పు, డుండ నీవు । పార్థివులువీరు లేకున్న వారు గా
రు । అందఱము ముందు తిరముగ, నుందుముగద ॥ ౧౨ ॥ జీవునకు దే
హమందున చిన్నతనము । జవ్వనము, జర, యొట్లులు సంభవించు । న
టులె దేహాంతరప్రాప్తి, యాత్మకిదులు । ధీరులైవారు మోహమొందరు ధీ
రులగుట ॥ ౧౩ ॥ పంచభూతాత్మకతవశమున ప్రభవమొందు । నింద్రియం
బుల, స్పర్శంబు లిచ్చుచుండు । నుష్ణశీతాది సుఖదుఃఖమొకటియెడను ।
గలుగు లేకుండు, నస్థిరములివి పార్థ! । యోర్పుకలిగియుండుటయె చా
లనుత్తమంబు ॥ ౧౪ ॥ ఏచవెవ్వాని నియ్యవి, యెవడు సమము । గాను
సుఖదుఃఖములజూచి కలగకుండు । వాడమృతత్వమునుబొందు, నర్హు
డు గద ॥ ౧౫ ॥ లేదు లేనట్టిదనునది, లేకపోదు । శాశ్వతంబగునట్టి
ది, నత్యమైన । బ్రహ్మమునజూచు కోవిదుల్ పరిగణింతు । రుభయని
ర్ణయమును జేసి, తెలిపిథపర్థ ॥ ౧౬ ॥ ఏది వ్యాపించి యున్నదో, యీ
జగమున । నద్దివాశరహితమని, నమ్ముకొనుత్త । నొకడు నాశమునొం
దింప, నోపునెట్లు ॥ ౧౭ ॥ శాశ్వతుడు నప్రమేయుడు నచరుడు దేహి ।

యంతకగునవి దేహంబులనుచు దెలిసి । మరము జేయంగ వేతెమ్ము
కురువరేణ్యా ! ॥ ౧౮ ॥ ఎవడు చంపెడువానిగా దెలుగు నాత్మ । నెవ
డు చచ్చినవానిగ దెలుగు నాత్మ । వారలిద్దరు తెలియనివారు దూవే,
యాత్మ చంపదు పరునిచే జంపబడదు ॥ ౧౯ ॥ పుట్టడీ యాత్మ గిట్టదు,
పుట్టి పెలుగు । వాడు గాడు, పురాణుడు, ప్రభవరహితుడు । డెప్పుడును
నుండు, శాశ్వతుం డీశరీర । మన్నులోక వేళ చంపన హతుడు గాడు ॥
౨౦ ॥ ఎఱుగు నీయాత్మ నెవ్వడు, చెఱుపు లేని । వానిగా, నిత్యుడజు
డు నవ్యయుడుగాను, । ఎట్టి నెటు చంపు? నెవని జంపించు వాడు? ॥
౨౧ ॥ వస్త్రములు జీర్ణమైనను వానిఁ విడిచి । నవముకూలములను గట్టు
నరుని పగిది । దేహి విడుచును జీర్ణమౌ దేహములను । దిరిగి పొందును నూ
తన దేహములను ॥ ౨౨ ॥ ఆత్మ నెప్పుడు ఛేదింప వాయుధములు । దా
హకుడు దహించడు; నీరు తడుప లేదు । అనిలభూతము శోషింప దాత్మ
నెపుడు; ॥ ౨౩ ॥ కాడు ఛేదింపదగు వాడు; కాల్చబడడు; । తడియ,
డెండడు; నిత్యుడు, స్థాణుడచలు । డంతటను నిండియుండు, సనాతని,
యతడు ॥ ౨౪ ॥ చక్షురాద్యలక్షితుడు గోచరుడు కాడు । మనమున
కు గోచరుడు గాడు, పనులు జేయు । నింద్రియంబుల విషయంబు నెపు
డు గాడు । ఇట్టివానిగ నీయాత్మ నెరిగి, నీవు । తగవు శోకింప, దుః
ఖంబు దలగబెట్టు ॥ ౨౫ ॥ నీవు నొక వేళ యాత్మను, నిత్యజాతు । నిత్య
మృతుని గమనమున నిలిపితేని । యర్హుడవుగావు శోకింప, నప్పుడైన
న ॥ ౨౬ ॥ జాతునికి నెట్లు మరణంబు సంభవించు । జాత మొందను
మృతునకైన జన్మము గదా । యనుక తప్పింపగూడని కార్యమునకు । నా
ర్తినొందంగ, నీకు సమర్థమదియా ॥ ౨౭ ॥ భూతములు నాది నవ్యక్త
ములు, నడుమను । వ్యక్తములు, నంతమందు నవ్యక్తములును । గాన
పరివేదనంబేమి వానికొరకు ॥ ౨౮ ॥ చిత్రముగ జూచునొకరుడు, చె

ప్పుదీని । విచిత్రతరముగ నొకఁడు, చెవులవినును । చోద్యముగ వేర
డొకఁడు, చూచి, చెప్పు । వినియు, మరిడొకఁ డిద్దాని విధ మెరు
గడు ॥ ౨౯ ॥ దేహములు సమస్తంబు వధింపబడిన, । దేహి నిత్యావ
వధ్యుండు, దీని నెరిగి । తగవు శోకింప, సర్వభూతములగూర్చి ॥ ౩౦ ॥
ఇంతెకాదు స్వధర్మంబు నెంచినైన । కంపమును బొందగూడదు,
క్షత్రియునకు । ధర్మయుద్ధంబువలె శుభదాయకంబు । గలుగదన్యం
బు గావున కంపమేల? ॥ ౩౧ ॥ వరపావృతస్వర్గసుద్వారమును, న ।
యాచితంబుననుక నట్టియాజిగంను । నట్టిపార్థివులెంతయు నధికసు
ఖులు ॥ ౩౨ ॥ అదియునుంగాక, నిజధర్మమైన రణము । సలుపవైతే
ని నిజధర్మఫలముఃకీర్తి । వదలి, పొందెదవఘునా! పాపనమితి ॥ ౩౩ ॥ జను
లునీయపకీర్తిని సాటుచుందు, । రదియయుక్తము, శౌర్యధైర్యాది సు
గుణ । సమితిచే పూజితుండైన, సజ్జనునకు । మేలు మరణంబు, నప
కీర్తిదేలుకంటె ॥ ౩౪ ॥ భయముచే యుద్ధమునుబీడి పారితంచు । వ
లుఁ దురుమున్న బహుమానభావణముల । నిన్నుబలుఁ మహారథుల్
సన్నుతిగని । చూరగొందువు పిమ్మట చులకదనమె ॥ ౩౫ ॥ నీమసామ
ర్థ్యమును దూఱునీయహితులు । పలుకగూడనివాక్యముల్ పలుకగల
రు । దానిమించిన దుఃఖంబు ధరణిగలదె ॥ ౩౬ ॥ పోరహతిసిన, స్వ
ర్గంబు బొందగలవు । అనుభవించెదు సామ్రాజ్యమాజిగెల్చి । యా
యితముగ ముక్కు కౌంతేయ! యందుచేత । యుద్ధమును జేయ, కృతని
శ్చయుండవగుడు ॥ ౩౭ ॥ సుఖము దుఃఖంబు సమముగజూచి, లాభ ।
నష్టముల, గెల్పునోటమి, శిష్టచరిత! । యన్నైపరికించి, యనిజేయవా
యితుడవు, । గమ్ము కౌంతేయ! పొందదఘమ్ము నిన్ను ॥ ౩౮ ॥ పలిఁ
తిని సాంఖ్యబుద్ధిని, పార్థ! నీకు । దేనిచే కర్మబంధంబు ద్రుంపగలవో ।
దాని, నా యోగమునమును, దవిలివినుము ॥ ౩౯ ॥ యత్ననాశంబు

గలుగద, యవలవచ్చు। ప్రత్యవాయంబునుం లేదు, ఫలమధికము।
స్వల్పమైనను బాపు, సంసారభయము ॥ ౪౦ ॥ ఆవిధానములో, నిశ్చ
యాత్మకంబు। నైనబుద్ధి, యొకటియు, యనంతములును। శాఖలెన్ని
యొగలవి, నిశ్చయరహితుల। బుద్ధులర్జున! ఫలకాంక్షబొందుకతన॥
౪౧ ॥ వాదశీలురఖండితుల్ వేదవాద। రతులు పుష్పింపులతవలె ర
మ్యమైన। పలుకు బలెక్రొదరాస్వర్గఫలముకంటె। ఫలము వేరొండులే
దని, పార్థ! మరియు ॥ ౪౨ ॥ కామరతులయి, స్వర్గంబె ఘనఫలంబు।
గాదలచువారు, జన్మంబు కర్మఫలము। గాగజెప్పుచు, నైశ్వర్యభో
గములను। గలుగజేసెడు, బహువిధకర్మసముద। యములబోధించు,
వాక్యములనుచునుంద్రు ॥ ౪౩ ॥ భోగమైశ్వర్యమునుగోరు భోగరతు
ల। కట్టిబోధముచే మనోహరణమగుట। నిశ్చయాత్మకమౌబుద్ధి నిల్వ
కుంట। చెప్పబడలేదువారికి స్థిరసమాధి ॥ ౪౪ ॥ వేదములు నర! త్రై
గుణ్యవిషయములుగ। జూచి, నిర్ద్వంద్వుడవు, నిత్యశుద్ధసత్వ। సహి
తుడవును, యోగక్షేమరహితుడవును। జ్ఞానివై, త్రిగుణములను
మానియుండు ॥ ౪౫ ॥ జలముతోనిండియుండినస్థలమునందు। బావి
యుపయోగమెంతయో బ్రహ్మవేత్త। యైన సద్బ్రాహ్మణునికెని, య
ఖిలవేద। గణమునంతయెయుపయోగకరము పార్థ! ॥ ౪౬ ॥ కలమనీ
కధికారంబు కర్మజేయ। కలుగజెప్పుడు తత్కర్మ ఫలమునకును।
గాన, మదినిచ్చయింపకు కర్మఫలము। మదిని గోరకు, కర్మలమాని
యుంట ॥ ౪౭ ॥ ప్రాప్తియందును,మరియునప్రాప్తియందు। నొక్కరీ
తి గనునమంట, యోగమగుచు। చొప్పు, నర్జున! యోగమందుం
డుమీవు। సముడవైయుండుము, జయాపజయములందు। కర్మమును
జేయుమెమ్ము, సంగంబువిడిచి॥ ౪౮ ॥ కర్మయోగంబు, బుద్ధియోగం
బుకంటె। దవ్వగుటచేత, నల్పంబుదానిఫలము। గోరువారు నికృష్ట

సంసారులుగద। శరణు బొందుము బుద్ధిని, పురుషవరేణ్య! ॥ ౪౯ ॥
బుద్ధియుక్తుండు విడుచు, నీభువనమునను। పుణ్యపాపంబులను, గాన,
బుద్ధియోగ। యుక్తుఁడవుగమ్ము, ఫల్గున! యోగమన్న। కర్మకౌశల
మేగాదె, కలుషరహిత! ॥ ౫౦ ॥ బుద్ధియుక్తులై మనునట్టి బుధులు,
కర్మ। ఫలముఁ విడిచి, పునర్జన్మబంధమెడలి। చనియెదరు, నిరుపద్రవ
స్థానమునకు ॥ ౫౧ ॥ దాటునెప్పుడు నీబుద్ధి, తనుపు మోహ। కలుష,
మప్పుడె విరతిని గాంచెదీవు। వినఁదగినయట్టి వినినట్టి విషయములకు ॥
౫౨ ॥ వేదవేదాంతవాక్యముల్ వినుటచేత। చలితమైయున్న నీబుద్ధి
చలనముడిగి। పరసమాధిని నెప్పుడు తిరముగనునో। పొందెదప్పుడు
యోగంబు పురుషవర్య! ॥ ౫౩ ॥

అర్జున—ఆసమాధిని స్థిరుఁడైన యట్టివాని। కేద్దిలక్షణ, మాతఁడు నేదిప
లుకు। నెట్లు కూర్చుండు, కేశవ! యెట్లు నడచు? ॥ ౫౪ ॥

శ్రీభగ—వదలునెప్పుడు మానసవాంఛలెల్ల। యలరునెప్పుడు, నాత్మదే
నాత్మఁ జూచి। పలుకఁబడునప్పుడే, స్థితప్రజ్ఞుఁడనుచు ॥ ౫౫ ॥ కలఁగఁడెవ్వఁ
డు తీవ్రదుఃఖములనదుమ। యెవఁడు సుఖములయందు నిస్పృహతనుం
డో। వీతరాగభయక్రోధుఁడాతఁడెవఁడో। పలుకఁబడు నాతఁడే, స్థితప్ర
జ్ఞుఁడనుచు ॥ ౫౬ ॥ ఎవఁడు సర్వత్ర సంగంబొకించుకైన। బొందక శు
భాశుభంబులఁబొంది, సంత। సంబు ద్వేషంబుదా, ననయంబుగనఁడో
యతని బుద్ధియె సుస్థిరంబైనదగును ॥ ౫౭ ॥ అంతటను కూర్మమెట్లు
తదంగములను। లోపలికిలాగి ముడుచునో యాపగిదిని। యెవఁడు వి
షయంబులందుండి, యింద్రియముల। ముడుచు, నాతని బుద్ధియొక
డుతిరంబు ॥ ౫౮ ॥ అణఁగు విషయంబులిటు నిరాహారుఁడైన। దేహికి,
తదిచ్ఛనిలచును, దివ్యమైన। యాత్మసందర్శనముతోడ, నదియునణ
గు ॥ ౫౯ ॥ బలతరంబైన యింద్రియవర్గమెల్ల। బ్రహ్మసంప్రాప్తికైయ

త్నపరుఁ వివేకి। మనము, హరియించు బలవంతమగు న, కిరీటి! ॥ ౬౦ ॥ అట్టిసర్వేంద్రియంబులనణచి, యోగి। మత్పరుండయి, యుండును మాన్యచరిత!। ఎవనికి నధీనమైయుండు, నింద్రియములు। వానిబుద్ధి థిరము పరబ్రహ్మమందు ॥ ౬౧ ॥ చిత్తమున విషయంబులదింత సేయు వానికాసక్తి గల్గును వానిగూర్చి;। కామముద్భవమొందు సంగంబు వలన;। కోరికను బుట్టుచున్నది క్రోధమరయ; ॥ ౬౨ ॥ కల్గుసమ్మోహమును క్రోధకారిణువలన;। స్మృతియు సమ్మోహమున చెడు; స్మృతివినాశ। మున నశించును బుద్ధియు; బుద్ధిచెడిన। చెడును పురుషుండు మిక్కిలి చేటునొంది ॥ ౬౩ ॥ ఇష్టమున యిష్టమును వీడి, యింద్రియములు। మనమునకులోంగి విషయములనుభవించు। చున్నను, మానంబు వశమునను న్నవాడు। పొందెడును, నిర్మలత్వంబు పురుషవర్య! ॥ ౬౪ ॥ అట్టినైర్మల్యమున గల్గు, నఖిలదుఃఖ। నాశనము, శుద్ధహృదయునకాశుగతిని। బుద్ధినిల్చును స్థిరముగ, బుధవిధేయ! ॥ ౬౫ ॥ నిల్వదాబుద్ధియింద్రియనిగ్రహంబు। లేనివానికి; వానికి లేకయుండు। బ్రహ్మభావన, భావనాభావమైన। శాంతిగల్గకయుండు, నశాంతునకును। పరమసుఖమెట్లుగల్గెడు? కురువరేణ్య! ॥ ౬౬ ॥ విషయముల నింద్రియంబులు విచ్చలవిడి। దిరుగుచుండగ, నేమది బురుషునాజ్ఞ। ననగియుండక, దిరుగునో యామనంబు। వానిప్రజ్ఞ హరియించు వార్థిమీద। దేలునోడను, గలచెడు గాలిభంగి ॥ ౬౭ ॥ కావున నెవని యింద్రియగణము, విషయ। వర్గములగూర్చి నియమింపబడుచునుండు। వానిబుద్ధియె స్థిరమని, పలుకబడును ॥ ౬౮ ॥ సర్వభూతంబులకు నిశాసమయమేదో। సంయములకద్దిజాగ్రత్తు; సర్వభూత। ములకు జాగ్రత్తు, నలసంయములకురాత్రి ॥ ౬౯ ॥ పూర్ణముగనిండి నిలుకడబొందియున్న। కడలి, నేరులు బడువలె, కామములును। నేజితేంద్రియు

బొందునో, నాజనుండు। కనెడు శాంతిని, కామియగాడతండు॥౭౦
సర్వకామంబులనుబాసి, జనుడెవండు। నిస్పృహతగాంచివిడుచునో
నేనునాది। యనెడుభావంబు, వాడొందు నధికశాంతి॥౭౧॥ బ్రహ్మ
మందలి నిష్ఠయై బరగునిదియె;। పొందిదీనిని మోహంబు బొందడో
కటా;। అంత్యమందైన నీనిష్ఠయందు నిలిచి। బ్రహ్మనిర్వాణమును
బొందుపార్థ! యతడు॥౭౨॥

ఇది సాంఖ్యయోగంబను ద్వితీయాధ్యాయము.



## * తృతీయాధ్యాయము. *

అర్జున—కర్మకంటెను జ్ఞానంబె ఘనమటంచు। నీమతంబయేని, కేశవ! నీ
వునన్ను। ఘోరకర్మంబునకు నియోగింపనేల? ॥౧॥ ద్వంద్వముగ
నున్న వాక్యపద్ధతిని, నామ। బుద్ధిమోహింపజేసెడి బుధునివలెనె।
యుంటి, వెద్దానిచే శ్రేయమోమహాత్మ!। నేనుపొందుదునో, దాని
నిశ్చయించి। చెప్పవేదాని, నొకదాని, శ్రీనివాస!॥౨॥
శ్రీభగ—పార్థయీలోకమందలి పరమనిష్ఠ। ద్వివిధముగముందు నాచేత
దెలుపబడిరెను। జ్ఞానయోగంబు, విబుధాలో సాంఖ్యులకును। యో
గులకు కర్మయోగంబు యుక్తమనుచు॥౩॥ కర్మచేయకయుండి, ని
ష్కర్ముడగునె?। కర్మసన్న్యాసముననె తాగనడు సిద్ధి॥౪॥ మరియు
బురుషుడు నెచటను, మానలేడు। కర్మజేయుట, క్షణమాత్రకాల
మైన। ప్రకృతిజన్యగుణంబుల వశముచేత। చేయబడు కర్మమందరి
చేత విధిగ॥౫॥ ఎవడు కర్మేంద్రియంబుల నెల్లనణచి। విషయచిం

తన, మనమున విడువకుండు। పల్కబడునట్టి మూఢుండు ప్రజలచేత।
వాడు పరమమిథ్యాచారవంతుడనుచు ॥ ౬ ॥ అర్జునా! తనజ్ఞానేంద్రి
యములనెవడు। మనముచేతను నియమించి, పనులుజేయు। నింద్రియం
బులచేత, ఫలేచ్ఛలేక। కర్మయోగంబుజేయునో, ఘనుడువాడు॥౭॥
నియతకర్మంబుజేయుము, నీవుపార్థ! కర్మవిడుచుటకంటెను, కర్మ తె
న్న। కాయమైననునిల్వదకర్మవలన ॥ ౮ ॥ యజ్ఞకర్మంబుకంటె తద
న్యమైన। కర్మలోకులబంధించుగాన, కర్మ। ఫలముగోరక, తత్కర్మ
సలుపుమీవు॥ ౯ ॥ బ్రహ్మయజ్ఞంబుతోడుత ప్రజలమనుపు। జేసి, దీ
నను బ్రజలను జేయుచుండు। ఉదియె మీరలుగోరు, నభీష్టములకు।
నగుమ కామధేనువటంచు, ననియె నజుడు ॥ ౧౦ ॥ దేవతలవృద్ధిబరుపు
డు దీనమీరు;। దేవతలుమిమ్ము వృద్ధిబొందింపగలరు। ఇట్టులన్యోన్య
మును వృద్ధినిచ్చి, మీర। లందెదరు, పరమశ్రేయ, మందువలన॥ ౧౧॥
యజ్ఞసంతృప్తులై మీకు, నమరులిత్తు। రిష్టభోగంబు, లట్టుల నివ్వబడు
చు। మారునివ్వక, తినువాడు చోరుడుగద ॥ ౧౨ ॥ యజ్ఞశిష్టాన్నము
ను దినునట్టి సుజను। లెల్లపాపంబులంబాతు, రెవరుపాపు। లైపచన
మును జేతురో, యాత్మపోష। ణార్థ, మవ్వారుభుజియింతు రఘము
భువిని ॥ ౧౩ ॥ అన్నమునబుట్టు భూతంబు, లన్నమరయ। బుట్టుపర్జ
న్యుచే, మరిబుట్టునతడు। యజ్ఞమున, కర్మచేగల్గునది కిరీటి! ॥ ౧౪ ॥
బ్రహ్మనుండియె కర్మంబు ప్రభవమొందె;। బ్రహ్మయక్షరునుండియుద్భ
వమునొందె;। సర్వగతుడగుబ్రహ్మ యజ్ఞంబునందు। నిత్యమును, నం
దుచేతనె, నెగడుచుండు ॥ ౧౫ ॥ ఇవ్విధి బ్రవర్తితంబయి, యిలనును
న్న। దానిననుసరించియెవడు తనదుచర్య। జరపడో, వాడఘాయు
వు, సక్తవిషయు। డౌట, వానిజీవనమిట వ్యర్థమగును ॥ ౧౬ ॥ ఆత్మ
రతుడును, తృప్తుడు నాత్మయందు। నాత్మ సంతుష్టుడును, నౌచు

నవని నెవడు, బరగు నతనికి విధియగుపనులు లేవు ॥ ౧౭ ॥ ఆతనికి కర్మ
చే బొందు నర్థములను । లేదు, చేయకయుండిన లేక యుండు, బ్రత్య
వాయంబొకింతయు, బరులనాశ్ర । యింపవలసినయర్థమొకింత, లేదు
॥ ౧౮ ॥ కావునను చేయదగినట్టి కార్యములను, ఫలముగోరక సతతం
బు సలుపుమీవు, ఫలముగోరక కర్మంబు సలుపునట్టి । పురుషుడొందు
ను మోక్షంబు, కురువరేణ్య! ॥ ౧౯ ॥ మున్ను జనకాదులందరు, మో
క్షపదవి । గాంచగల్గిరి, నిష్కామకర్మవలన; మరియు లోకసంగ్రహ
మునే, యరసి నీవు । కర్మమును చేయదగుదువు, కలుషరహిత! ॥ ౨౦ ॥
శ్రేష్ఠుడే కర్మమును, నిలజేయుచుండు, దానినే యితరజనము, దవిలి సే
యు; మరియు నాతడు జేయు ప్రమాణమునకు । ననుగుణంబుగ వర్తిం
చు నఖిలజగము ॥ ౨౧ ॥ నాకు కర్తవ్యమును లేదు, నన్ను గూర్చి । పొం
దబడనిదియును, నికపొందదగిన । యర్థమీమూడు లోకంబులందు లేదు;
ఐన, వర్తింతు కర్మంబుననుసరించి ॥ ౨౨ ॥ అప్రమత్తుడనై, కర్మమం
దు నేను, సంచరింపకయున్నను, జనములెల్ల, ననుసరింతురు నామా
ర్గమన్నియెడల ॥ ౨౩ ॥ చెడును ముల్లోకములు కర్మ చేయనేని, వ
ర్ణసంకరమును జేయువాడనగుదు । ప్రజలనందుచే జెరిచినవాడనగు
దు ॥ ౨౪ ॥ సంగమున కర్మ నజ్ఞులు సలుపునట్లు । జ్ఞాని నిస్సంగుడై కర్మ
సలుపవలయు । లోకసంగ్రహణార్థంబు లోలుడగుచు ॥ ౨౫ ॥ అజ్ఞు
లును కర్మసంగులునైనవారి । బుద్ధిభేదంబు జేయగ, బుధుని కెపుడు, త
గదు, యుక్తుండై కర్మ తాను జేసి । యొరులచే దాని జేయింప, నొ
ప్పుగాని ॥ ౨౬ ॥ ప్రకృతిజన్యగుణంబులవలన, నన్ని । విధములను జే
యబడు కర్మ, విచ్చలవిడి । నలయహంకారమూఢాత్ముడైనయాత్మ ।
కర్త దానని, దలచును కలతజెంది ॥ ౨౭ ॥ గుణములను, వానికర్మల
గుర్తెరింగి । విభజనము జేసి, తత్త్వవేదియైన । వాడు, గుణములు

గుణములవలనతిరుగు । చుండుననియెంచి, తానుసక్తుండుకాడు ॥౨౮॥
ప్రకృతిగుణములచేతను భ్రాంతులగుచు । మూఢులగువారు, గుణకర్మ
ములను, సక్తులగుదు, రల్పజ్ఞులను మందులైనవారి । బుద్ధిని, చలింప
గూడదు, బుధుడెవండు॥ ౨౯ ॥ సర్వకర్మలనాయందు సన్న్యసించి।
యాశయును మమకార మధ్యాత్మబుద్ధి । వదలి, సంతాపమనులేని
వాడవగుచు । యుద్ధమునుజేయుమర్జున! యొప్పనదియె ॥ 30 ॥ శ్రద్ధ
గల్గి, యసూయావిచారమెడలి । యేమనుష్యులు నాదగునీమతంబు ।
ననుసరింతురో నిత్యంబు నట్టివారు । పుణ్యపాపాదికర్మల బొందరె
పుడు ॥ 3౧ ॥ ఎవరసూయనుగల్గినాయీమతంబు । ననుసరింది ప్రవ
ర్తింప, రట్టిమూఢు । లజ్ఞులర్జున! చెడినవారనుచుదలపు ॥ 3౨ ॥ స్వ
స్వభావానుసారంబు సంచరించు । జ్ఞానియును, భూతచయములు స్వ
స్వభావ । మనుసరించియె వర్తించు, నందువలన । నేమిచేయను నిగ్ర
హంబె చటనైన ॥ 33 ॥ ఇంద్రియవిషయములగూర్చి, యింద్రియములు
నిడియున్న విద్వేషరాగములు నరయ । నీవివశవర్తియాట వివేకికె
పుడు । తగదు; పరిపంథులౌటను తన్నుజెరుచు ॥ 3౪ ॥ బాగుగను నా
చరింపగబడినయట్టి । పరులధర్మంబుకంటెను, విరసముగను । సలుపబ
డినట్టిదైనను, స్వంతధర్మ । మెంతయో లెస్స, దాననుమృతియుమేలు;॥
నంతట బరధర్మంబు భయావహంబు ॥ 3౫ ॥

అర్జున—అయిన నెద్దానిప్రేరణ నబలుడగుచు । పురుషుడిచ్ఛయులేకుం
డ, దురితములను । జేయు, బలవంతముగ, నియోజితునివలెను ॥3౬॥

శ్రీభగ—అదిరజోగుణమువలన నంకురించు । కామమును మరిక్రోధంబు,
కామమరయు । సర్వభక్షకమును పాపసంఘురూప: మాటనీమార్గము
ననది, యధికవైరి ॥ 3౭ ॥ ధూమమున వహ్ని, యద్దంబు దుమ్ముచేత
మావిచేగర్భమెట్టులు మరుగుపడునో । యటులెదానిచే నావృతంబు

మ్యానిదియు ॥ ౩౮ ॥ మఱుఁగుపడె దీనిచే జ్ఞానమరయఁ పార్థ! । జ్ఞానుల
కు నిత్యశత్రువు, చాలుటయును । లేదు, నిందింపశక్యంబు గాదనుమ్ము॥
౩౯ ॥ ఇంద్రియములు మనము బుద్ధియొప్పుదుదీని । కాశ్రయంబులు,
వానిచే నావరించి । ముంచువిజ్ఞానమును, దేహి మోహపరచు ॥ ౪౦ ॥
గాన కౌంతేయ! తొల్తను, కడగినీవు । నింద్రియంబులనియమించి యిదే
పడంచి । జ్ఞానవిజ్ఞాననాశిని సర్వపాప । రూపియగు, కాముఁడనుపా
పి రూపుమాపు ॥ ౪౧ ॥ ఇంద్రియంబులుశ్రేష్ఠంబు, లింద్రియముల ।
కెక్కుడు మనంబు, మనమున కెక్కుడగును । బుద్ధి, బుద్ధిని మించిన
బోధరూపి । శ్రేష్ఠతముఁడని, యర్జున! చెప్పబడెను ॥ ౪౨ ॥ ఇవ్విధిని
బుద్ధికంటెను నెక్కుడైన । నాత్మ నెఱుగుచు నాత్మచే నామనంబు ।
నిగ్రహించి, దురాసదశత్రుడైన । కామరూపుని జంపుము కలుష ర
హిత! ॥ ౪౩ ॥

ఇది కర్మయోగమను తృతీయాధ్యాయము,



## చతుర్థాధ్యాయము

---

శ్రీభగ—అవ్యయంబైనయీయోగమర్కునకును । జెప్పినాడను, నాత
డు జెప్పెమనువు । నకును, నాతడు నిక్ష్వాకునకును జెప్పె ॥ ౧ ॥
ఇటుపరంపరప్రాప్తమౌ నీసుయోగ । మెల్ల రాజర్షులెరిగిరి, యవల కాల।
మధిక మేగిన, నిదినష్టమయ్యెపార్థ! ॥ ౨ ॥ ఈపురాతనమౌ యోగ
మిపుడునీకు । చెప్పబడియెనునాచేత, స్నేహితుఁడవు । పరమభక్తుండవ
నౌటను పార్థ! యిదియతిరహస్యంబు, నుత్తమోత్తమమునుసుమ్ము॥౩॥

అర్జున—నీదుజన్మంబు వెనుకను, నీరజాప్తు। జన్మమునుముందు, నటులౌట, జలజహితున। కాది నే నేనుజెప్పితి ననెడు, నీదు। వాక్య మెట్టుల దెలియుదు, వాసుదేవ! ॥ ४ ॥

శ్రీభగ—నాకునీకును గడచె ననేకజన్మ। లర్జునా! యెరుగుదు నవియన్ని నేను। యెరుగవీవు పరంతప! యంచు కైన ॥ ५ ॥ అజుడ నవ్యయమైనట్టి యాత్మమయుడ,। నీశ్వరుడ భూతగణములకెల్ల, మరియు। ప్రకృతి నెవ్వ డధిష్టించి పార్థ! నేను। యాత్మమాయచే నివ్విధి, నవతరింతు ॥ ६ ॥ ధర్మనాశంబు మరియు నధర్మవృద్ధి। యెవ్వ డెవ్వడు గల్గునో యప్పుడపుడె,। పుట్టుదును నిజమాయనుబొంది నేను ॥ ७ ॥ సాధుజనరక్షణంబునుసలుప, దుష్ట। జనవినాశంబు జేయంగ, జగములోన। ధర్మసంస్థాపనార్థంబు, దవిలి నేను। యుగయుగంబున, సంభవ మొందుచుందు ॥ ८ ॥ ఎవడు తత్వవిలోకన, నిట్టి నామ। దివ్యజన్మంబు కర్మంబు దెలుసుకొనునో,। వాడు దేహము త్యజియించి, వసుధ మరల। పొంద డిక జన్మ, మరినన్నె బొందువాడు ॥ ९ ॥ వీతరాగభయక్రోధవిబుధు లెంద। రెందరో మున్మయులు, నన్ను నెరిగికొలిచి। జ్ఞానతపమున, శుద్ధులై సవ్యసాచి!। నాస్వరూపంబుబొందిరి నాడెముగను ॥ ౧౦ ॥ ఎవ్వ రేమార్గమున నన్ను నెరుగుచుందు,। రట్టులే ననుగ్రహమున నాదరింతు। నరులు సర్వవిధంబుల నామమార్గ। మనుసరించుచునున్నవారలనువిదూర ॥ ౧౧ ॥ కర్మఫలసిద్ధి నెవ్వరు కాంక్షసేతు। రీభువిని, వారు దివ్యుల నెపుడుగొల్తు;। రేలయన, కర్మఫలసిద్ధి, యీమనుష్య। లోకమున, శీఘ్రకాలంబులోనగల్గు ॥ ౧౨ ॥ పార్థ! సృజియించితిని నాల్గువర్ణములను। నేను గుణకర్మవిభజన, గాన కర్త। నాము, నైన, నకర్తను, నవ్యయుడను ॥ ౧౩ ॥ కర్మములు నన్నునంటవు, కర్మఫలము। నిచ్ఛ

యుంపను, నేనని యెవ్వడెరుగు। వాడు కర్మలచే కట్టువడడుపార్థ! ॥ ౧౪ ॥ ఇట్లెరుంగుచు నెపుడు మోక్షేచ్ఛగల్గి। యుండియును, పూర్వులందరు నుక్తమైన। కర్మమును జేసియుండిరి; గాననీవు। పూర్వులొనరించినట్టిదియు, పూర్వతరము। నైన, కర్మము నే జేయుమదియె లెస్స ॥ ౧౫ ॥ కర్మ యెట్టిది, యెట్టిదకర్మ, యనెడు। విషయమున మోహితులుగద విబుధులైన,। కావునను నీకు జెప్పెద, కర్మయిదియు,। నిది యకర్మయటంచు, నీ వెరిగి దీని। నశుభములనుండి ముక్తుండ వగుదుపార్థ! ॥ ౧౬ ॥ తెలియవలె కర్మతత్వంబు, తెలియదగు, వి। కర్మతత్వంబు, మరియు నకర్మ తెరగు,। చాల గహనంబు కర్మంబు సరణిపార్థ! ॥ ౧౭ ॥ కర్మమునను నకర్మంబు గను నెవండు। ఎవడకర్మంబునను, కర్మ నెరుగుచుండు। నాతడే బుద్ధిమంతుడు, నతడు సకల। కర్మముల జేసినాతడు, ఘనుడు, యోగి ॥ ౧౮ ॥ ఎవనిసర్వ ప్రయత్నంబు లెల్లయెడల। కామసంకల్పవర్జిత కర్మలగునో,। యెవని కర్మలు జ్ఞానాగ్ని నెపుడు దగ్ధ। ములో, నతడు పండితుండని బలుకబడును ॥ ౧౯ ॥ కర్మఫలసంగమును వీడి నిర్మలుడయి,। సర్వదా తృప్తుడును, నిరాశ్రయుడునగుచు। కర్మముల జేసియును, వాడు కర్త గాడు ॥ ౨౦ ॥ ఆశ లేకను, చిత్తంబు నాత్మనిగ్ర। హించి, సర్వ పరిగ్రహ మెడలి, యెవడు। కాయమునమాత్ర మే, దాను కర్మ జేయు। చుండె నేనియు, కిల్బిష మొందడతడు ॥ ౨౧ ॥ మరియు నెవ, డె దృచ్ఛాలాభ మాత్రమునను,। తృప్తుడై, ద్వంద్వములదాటి, తెగిన మత్స। రంబునను, లాభనష్టసంప్రాప్తములను,। సమముగాజూచి, కర్మంబునలుపుచుండు,। కట్టువడ డెప్పు డాతడా కర్మవలన॥ ౨౨॥ సంగరహితుండు, ముక్తుడు, జ్ఞానమందు। చిత్తమును నిల్పువాడు, నశేషకర్మ। యజ్ఞముంబలె జేసెడు నాతనికిని,। ఫలసహితకర్మమంత

యు విలయమగును ॥ ౨౩ ॥ బ్రహ్మమే స్రుక్స్రువాదులు, బ్రహ్మమగు
ను ॥ నలహవిస్సును, బ్రహ్మంబునగ్ని, మరియు । బ్రహ్మమే కర్త, హు
తమును బ్రహ్మమగును, । బ్రహ్మకర్మసమాధిని బ్రహ్మవేత్త । పడయ
దగునట్టిఫలమును బ్రహ్మమెయగు ॥ ౨౪ ॥ కర్మయోగులు కొందరు
కర్మఫలము । గోరి, యజ్ఞంబు దివ్యులఁగూర్చి చేతు, । రవలజేతురు
కొందరీయజ్ఞమె తమ । యాత్మలను పరబ్రహ్మాగ్నియందు వ్రేల్చి ॥ ౨౫ ॥
ఇంక కొందరు శ్రోత్రముఖేంద్రియముల । సంయమాగ్నిని వ్రేల్తురు, శబ్ద
మాది । యౌ విషయంబులను నింద్రియాగ్నులందు । వ్రేల్చుచున్నా
రు గొందరు, వినుతశూర ! ॥ ౨౬ ॥ అవల గొందరు సర్వేంద్రియ
ములకర్మ, । ప్రాణకర్మయు, జ్ఞానదీపాన వెల్గు । నాత్మసంయమయో
గాగ్నియందు, వ్రేల్తురి ॥ ౨౭ ॥ ద్రవ్యయజ్ఞంబు కొందరు, తపమని
యెదు । యజ్ఞమును కొందఱలు యోగయజ్ఞ మింక । కొందరును, వేద
పఠంబు కొందఱమంది, । జ్ఞానయజ్ఞంబు కొందరు, సంశితవ్రతులు
జితేంద్రియులును నయి, సలుపుచుంద్రు ॥ ౨౮ ॥ ప్రాణము నపానమున,
వ్రేల్చువారు కొంద, । రలయపానము ప్రాణంబునందు వ్రేల్చు ।
వారు కొందరు, కొందరు ప్రాణమును న । పానమును నిగ్రహింతురు,
పరమనిష్ఠ ॥ ౨౯ ॥ నియతమాహారండిగలవారు, నేర్పుమెరయ ప్రా
ణముల వ్రేల్చుచుందురు ప్రాణములను, । వీరలందరు నలయజ్ఞవిదు
లగుదురు ; । యజ్ఞమునవీతకల్మషులైనవారె ॥ ౩౦ ॥ యజ్ఞశిష్టామృ
తంబును నాహరించు । వారు, శాశ్వతబ్రహ్మంబు జేరగలరు । యి
న్నిటను నొకటైనఁగూడ నెవడు జేయ । డంచు, వానికి నీలోక
ముండదనిన, । యికను వానికి పరలోక మెక్కడుండు ॥ ౩౧ ॥
ఇట్లు పలువిధయజ్ఞంబు లిన్ని, వేద । మందు వివరింపబడినవి, యన్ని
యు నివి । కర్మచేబుట్టె, నప్పుడెగాంచి నీవు । పొందెదవు మో

తమ్మును, పార్థ! బుధులనుచు ॥ ౩౨ ॥ ద్రవ్యయజ్ఞంబుకంటెను,
భవ్యతరము । జ్ఞానయజ్ఞంబు, కర్మసంచయము దెల్ల । నాశనముగాక,
తుదకు విజ్ఞానమందు । పరిసమాప్తినిబొందెడు కురువరేణ్య! ॥ ౩౩ ॥
తత్త్వవిదులైనజ్ఞానులుదవిలి నీకు । దేని బోధింపగలరో, యాజ్ఞాన
మీవు । పాదములవ్రాలి, సేవించి, ప్రశ్నజేసి, । తెలియుము యర్జున!
యద్దాని దివిరినీవు ॥ ౩౪ ॥ దేనిదెలిసిన మోహంబుదిరిగి నీవు ।
పొందవో, దేనిచే సర్వభూతములను । నాత్మయందునజూచెదో, య
టులెమరియు । నర్జునా! జూడగలవు నాయందు నీవు ॥ ౩౫ ॥ పాపు
లందరికంటెను పరమనీచ । పాపివయ్యును, జ్ఞానప్లవంబుచేత । న
ర్జునా! దాటగలవు పాపార్ణవంబు ॥ ౩౬ ॥ మండుచున్నట్టి యగ్నియే
మాడ్కినెందు । కట్టెలను భస్మమౌనట్లుగాల్చు, నటులె, కర్మచయ
ములజ్ఞానాగ్నికాల్చివేయు ॥ ౩౭ ॥ జ్ఞానతుల్యపవిత్రంబు, జగమునందు।
కల్గదన్యంబు, నదితగుకాలమునను । యోగసంసిద్ధుడైనట్టి యోగిపొం
దు । నర్జునా! స్వయముగ దనయాత్మయందు ॥ ౩౮ ॥ శ్రద్ధయును త
త్పరత్వంబు చాలగల్గి । యింద్రియజయంబు, గల్గినయుద్ధచరితు । డొం
దు నాజ్ఞానమును; నటుపొంది, మిగుల । శీఘ్రకాలంబులో, శాంతి
జెందునతడు ॥ ౩౯ ॥ అజ్ఞుడశ్రద్ధధానుడు, నటులెసంశ । యాత్ముడును
ను, చెడిపోవును, రట్టిసంశ । యాత్మునకు నిహపరములయందు సుఖ
ము । లేదు, గావున, శాంతియులేదు పార్థ! ॥ ౪౦ ॥ యోగసన్య
స్తకర్ముడై యున్నవాడు । జ్ఞానసంఛిన్నసర్వసంశయుడు, నాత్మ । వం
తుడగు, వానికిది కర్మబంధమున్నె? ॥ ౪౧ ॥ కాననీహృదయంబున క
లిగియున్న । యెల్లయజ్ఞానమున బుట్టినట్టి, సంశ । యంబు నరకుము;
జ్ఞానఖడ్గంబు చేత । యోగమును జేయు మిక లెమ్ము యుద్ధమునకు ॥ ౪౨ ॥

ఇది జ్ఞానయోగము ను చతుర్థాధ్యాయము—

# పంచమాధ్యాయము.

---

అర్జున — కర్మసన్న్యాసమును మరికర్మయోగ। మునువచించితి, శ్రీకృ
ష్ణ! యిప్పుడింది। యేదియీ రెంటిలో శ్రేయ, మదినిశ్చి। త
ముగ, నొకటి, జెప్పవేదవిలి నాకు॥ ౧ ॥
శ్రీభగ — కర్మసన్న్యాసమును, మరికర్మయోగ। మును, నుభయమును,
శ్రేష్ఠములిచ్చును మాపార్థ! కర్మసన్న్యాసమునుమించు, కర్మయోగ।
మెక్కుడై, యీశ్వరార్పణ మెఱిగిచేయ॥ ౨ ॥ ద్వేషమెవ్వడు జెంద
డో, దేనినియును। కోరడో, ద్వంద్వములకును దూరుడెవడొ। వాడె
యగు, నిత్యసన్న్యాసి, వాడెసుఖము। గా త్యజించును, బంధంబుక
లుష మెడలి॥ ౩ ॥ బాలకులువలుకుదురు, భిన్నఫలదములుగ। సాంఖ్య
మును యోగమును, పటుజ్ఞానులవరు। యుభయమందొక్కటైనను,
నుత్తమముగ। నాశ్రయించిన, ఫలముందునది, సమంబె॥ ౪ ॥ జ్ఞాన
నిష్ఠులచేత, నేస్థానమొందఁబడునొ, యదికర్మయోగులు బడయగ
లరు। యెవడు యోగంబుసాంఖ్యంబు నేకరీతి। జూచు, నాతడుమా
త్రమె జూచువాడు॥ ౫ ॥ యోగము లేక, సన్న్యాస మో కిరీటి।
పొందశక్యంబుగానిది, ముందుకర్మ। యోగియైమునినంబున నుండు
వాడు। శీఘ్రకాలంబులో బ్రహ్మజేరగలడు॥ ౬ ॥ యోగయుక్తుం
డు, శుద్ధాత్ము, డొడలువశము। నంతుగలవాడు, సర్వేంద్రియముల
గెలిచి। నాత, డాత్మనుసర్వభూతాత్మలందు। గనుచు, జేసిన, నం
టవుకర్మలతని॥ ౭ ॥ ఏమియును జేయనేనని యెంచుతత్త్వ। వేదియౌ
యోగి, జూచుచు, వినుచు, తాకు। చును, భుజించుచు, వాసన జూ
చుచుండి। కదలుచును, నిద్రజేయుచు, గాలివీల్చి। ౮ ॥ పలుకుచు
ను, విడుచుచు, చేతపట్టుకొనుచు। కనులదెరచుచు మూయుచు, బ

హుళముగను। నింద్రియార్థంబులందున నింద్రియములు। దిరుగుచు
న్నవటంచు, సుస్థిరత, దలచు॥ ౯ ॥ బ్రహ్మమందన్నికర్మలఫలమువిడి
చి; సంగమును లేక, కర్మలసలుపునెవడు । వానినంటవుపాపము,
లబ్బారి, జలజ । పత్రమునునంటనట్లుగ, బాహుశాలి! ॥ ౧౦ ॥ కాయ
మున మనమున, బుద్ధి, గాంక్ష లేని । యింద్రియంబులచే, సంగమెడ
లి, కర్మ । వాత్మసంశుద్ధికై, యోగులాచరింత్రు ॥ ౧౧ ॥ కర్మఫల
మునువిడిచి, నిష్కామయోగి । గాంచుదానాత్మ నిష్ఠచేగల్గుశాంతి
ఫలమపేక్షించి, కర్మంబుసలుపువాడు । ఫలముగోరుట, సక్తుడై బద్ధు
డగును ॥ ౧౨ ॥ ఇంద్రియజయంబుగల్గువా, డెల్లకర్మ । ములనుమన
మునద్యజియించి, మోదమొందు । మరినవద్వారములుగల పురము
వంటి । దేహమున, వసియించుచు, దేనిజేయ । కుండు, వెట్టులుజే
యింపకుండునతడు? ॥ ౧౩ ॥ కలుగజేయడుప్రభుడు, లోకంబునకు
ను। కర్మకర్తృత్వముల, మరికర్మఫలము । నందుసంయోగమును, ని
వియన్నిగలుగు । ప్రకృతిమాయాస్వభావప్రవర్తనమున ॥ ౧౪ ॥ పు
ణ్యపాపంబులొకనివిబొందడాత్మ; । మాయబడియున్నదజ్ఞానమున
వివేక । మంతచేజంతువులు మోహమొందుచుండ్రు ॥ ౧౫ ॥ ఎవరి
యజ్ఞానమదినశియింపబడునో । జ్ఞానమున, వారిదైనయాజ్ఞానమినుని।
వెల్గువలె, పరమాత్మను వెలుగజేయు ॥ ౧౬ ॥ బ్రహ్మబుద్ధులు, బ్ర
హ్మాత్మభావనులును । బ్రహ్మనిష్ఠులు, బ్రహ్మపరాయణులును । జ్ఞాన
నిర్ధూతపాపులు నాబరగెడు । వారు, పునరాగమములేని పదవిగాం
త్రు ॥ ౧౭ ॥ విద్యయునువినయముగలవిప్రునందు । గోవునందును, కరి
యందు, కుక్కయందు । శ్వపచునందును, బ్రహ్మంబుసమముగాను ।
జూచువారలె జ్ఞానులు సుభగచరిత ॥ ౧౮ ॥ బ్రహ్మసమభావమందు,
నెవ్వరిమనంబు । స్థిరముగానుండు, వారలీక్షితిలమున । నుండియే,

సర్గమును బాసియుండఁగలరు। బ్రహ్మనిర్దోషమును, సమవర్తియగుట।
వారలును బ్రహ్మమందున్నవారేసుమ్ము ॥ ౧౯ ॥ మోహవర్జితుడై, స్థిర
బుద్ధిగల్గు। బ్రహ్మవిదు, డున్నవాడయి బ్రహ్మమందు। ప్రియముఁబొం
దుచు నలర, డప్రియముఁబొంది। శోకమును బొందకుండును, భూర
వర్య! ॥ ౨౦ ॥ బాహ్యవిషయంబులందు తత్పరత లేని। మనముగలవా
డు, తనదగుమానసమున। నుపశమంబను, చిత్సుఖమొందు నెద్ది। బ్ర
హ్మయోగమునం దాత్మబరపివాడు। నక్షయంబైనసుఖము, దానందు
చుండు ॥ ౨౧ ॥ పార్థ! విషయేంద్రియంబులవలనబుట్టు। నట్టిభోగం
బులన్ని, యాద్యంతములను। గలవి; యవిదుఃఖమునకును కారణము
లె;। గానబుధుడానజేయడు వానిగూర్చి ॥ ౨౨ ॥ కాయమెవ్వడు వి
డుచుటకంటెముందు। కామవేగము క్రోధవేగంబు, నిహము। నందె
యోర్వగశక్తుడో, యట్టినరుడు। యుక్తుడును, సుఖవంతుడు యోధ
వర్య! ॥ ౨౩ ॥ అంతరాత్మసుఖయించు, నంతరాత్మ। బరగిరమియిం
చు, నంతరప్రభను వెల్గు। బ్రహ్మభూతుండునైన, యాబ్రహ్మయోగి।
బ్రహ్మనిర్వాణమొందెడు పార్థ! తాను ॥ ౨౪ ॥ క్షీణకల్మషులును,
మరిఛిన్నసంశ। యాత్ములును, నియతాత్ములు, నఖిలభూత। హితరతు
లునగు, ఋషివర్యులతులితముగ। బ్రహ్మనిర్వాణమును, తాము వడ
యగలరు ॥ ౨౫ ॥ వదలి కామము క్రోధంబు, మదినిగెలిచి। యా
త్మవేత్తలై బరగెడి యతులు పార్థ!। బ్రహ్మనిర్వాణమంతట, బడ
యగలరు ॥ ౨౬ ॥ బాహ్యవిషయములను వెలుపలకుద్రోసి। చూపు
భ్రూమధ్యమందున సూటిజేసి। నాసికాభ్యంతరంబున నడచుచుం
డు। ప్రాణమున పానమును సమపరచి, మరియు ॥ ౨౭ ॥ ఇంద్రియ
ములు మనము బుద్ధి యెల్లయెడల। వశమునందున్నవాడును, పార
దోల। బడిన యాశయు భయము కోపమునుగలిగి। మోక్షమందిష్ట

మనముగల్గి మునియున్నైన। వాఁడు, సర్వదా ముక్తుఁడే, బాహుశాలి ॥
౨౮ ॥ యజ్ఞతపములకును భోక్త, యఖిలలోక। ములకు మహేశ్వరు
డును, భూతములకెల్ల। సుహృదుఁడనునని, నన్నెరు జూచుచుం
ద్రము। పార్థ! వారలు గాంతురు పరమ శాంతి ॥ ౨౯ ॥

ఇది కర్మసన్న్యాసయోగము పంచమాధ్యాయము—



## షష్ఠాధ్యాయము.



శ్రీభగ—కర్మఫలమాశ్రయించక; కర్మవిధిగ। నాచరించెడువాఁడె, సన్న్యా
సియగును। అగును యోగియు; కాఁడల్లయగ్నిహోత్ర। ములను క
ర్మలవదలిన, మూర్ఖుఁడెపుడు ॥ ౧ ॥ అంచు రెద్దాని సన్న్యాసమనుచు,
నదియ। కర్మయోగంబుగా, నీవుగనుము పార్థ!। వలవన, యోగిగా
నేరఁడెవ్వఁడైన। ఫలమపేక్షించు సంకల్పములను విడక ॥ ౨ ॥ జ్ఞాన
యోగము నెక్క-నిశ్చయముజేయు। సన్మునికి; కర్మమునబడు సాధనం
బు,। జ్ఞానమెక్క-నయతనికి- సర్వకర్మ। ములనివృత్తియె, సాధనము
గనుగనుము ॥ ౩ ॥ ఎప్పుడాసక్తినుంచఁడో, యింద్రియార్థ। ములగురించి
యు, కర్మలవలన, నపుడె। సర్వసంకల్పసన్న్యాసి, సర్వయోగ। సిద్ధి
బొందినవాఁడని, చెప్పఁబడును ॥ ౪ ॥ ఉద్ధరింపగవలె నాత్మనాని యా
త్మ!। ద్రోయగూడదు నాత్మనధోగతికిని;। అదియు నేలన, నాత్మయే
యాత్మకెపుడు। బంధుఁడగు, నాత్మయాత్మకు పగతుఁడగును; ॥ ౫ ॥
ఆత్మచే నెవ్వఁడు జయించు నాత్మ, వాని। యాత్మయే యాత్మబంధు
వు, నాత్మజయము। లేనివానికి నాత్మయే యూనిరిపుని। వలెప్రవర్తిం

చు శత్రుత్వవ ర్తనమున ॥ ౬ ॥ అత్మజయ ము డుపశాంతుడునై నవాని। యాత్మ, శీతోష్ణములయందు, నార్తిసుఖము। లందు, మానావమా నంబులందు, నటులె। యెక్కువగసమాహితముగ నెపుడునుండు ॥౭॥ జ్ఞానవిజ్ఞానముల, దృప్తిమానినట్టి। యాత్మ గల్గిన కూటస్థు, డన్ని యిం ద్రి। యముల గెల్చి, విలోకించు, నల్లకుంటి। పెడ్డయును, రాయి, బం గారు, భేదరహిత। ముగను, నాతయోగి యారూఢుడగును పార్థ! ॥ ౮ ॥ ప్రతినిగోరని సుహృదుని పక్షమందు। ప్రతిన పేక్షించు మిత్రుని పక్షుమందు। పగతునందు, నుదాసీన భావునందు। దివిరిమధ్యస్థునందును, ద్వేషునందు। బాంధవులయందు, సాధులపాలనటులె। పా పులందును, సమబుద్ధిబరగువాడు। చెప్పబడు యోగులందున శ్రేష్ఠ డనుచు ॥ ౯ ॥ నిగ్రహింపగవలె, యోగి; నిరతమాత్మ। విజనమా స్థ లమందున విడిసి, యొకడు। యాత్మచిత్తంబు తనవశమందు బెట్టి। యాశయును పరిగ్రహమును నందకుండ ॥ ౧౦ ॥ పిజనపరిశుద్ధతలము ను వెదకి, యందు। నున్నతంబుగ పొట్టిగనుండనట్టి। వస్త్రిమజినం బు కుశలును వరుసమీర। స్థిరముగను నాసనంబును సిద్ధపరచి ॥౧౧॥ అందుపైనిల్చి, మనము నేకాగ్రముగను। జేసి, చిత్తేంద్రియక్రియ ల్జేర కుండ। నుంచి, తనయాత్మశుద్ధికై యోగమెపుడు। నభ్యసింపగవలె యోగి యహరహంబు ॥౧౨॥ కాయము శిరంబు కంఠంబు కదలకుం డ। సమముగాజేసి నాసికాగ్రమునుజూచి। సుస్థిరంబుగ దిక్కులజూ డకుండ ॥ ౧౩ ॥ మిగుల శాంతమానసుడును, విగతభయుడు। బ్రహ్మ చర్య్వ్రతస్థుడు, వశముగాగ। మనమునియమించి, నాయందె మది నినిల్పి। యుండవలె, మత్పరుండయి, యుక్తుడగుచు ॥ ౧౪ ॥ నియత మానసుడగు యోగి, నిరతమిట్టు। లాత్మయుక్తుడై, నిర్వాణమగుచు నాయ। ధీనమంచన్న, శాంతిని దేలగలడు ॥ ౧౫ ॥ అపరిమితభోజకీ

యోగమబ్బబోదు; । బొత్తిగాతిండితినకున్న బొందబడదు; । నిద్రబో
తుకు యోగంబు నిలువకుండు । నిద్రలేకయె మేల్కొన్న నిలువబో
దు; ॥ ౧౬ ॥ యుక్తభోజనమును, మరియుక్తవిహా । హారమును, క
ర్మచేష్టలు, పారమైన । నిద్రమెలకువ, గలిగిన భద్రయోగి । కేగలు
గు దుఃఖనాశమా యోగమెపుడు ॥ ౧౭ ॥ ఎపుడునియమితమౌ చిత్త,
మెందుబోక । నదియు నాత్మస్వరూపంబునందె నిలుచు । సర్వకామం
బులందలి చవులువిడచు । నప్పుడా యోగి తానగ్నుడనగబరగు ॥ ౧౮ ॥
ఆత్మయోగము సలుపు, నియమితచిత్తు । డైనయాయోగిదౌనిష్ఠ, య
నిలరహిత । దేశమందుచలించని దీపమునకు । సాటిగానెంచబడియె
ను, సవ్యసాచి! ॥ ౧౯ ॥ యోగసేవను చిత్తంబు లాగబడుచు । నె
ప్పుడుపరతిబొందునో, యెప్పుడాత । డాత్మచే నాత్మజూచుచునలరు,
నాత్మ ॥ ౨౦ ॥ ఎవ్వడతీంద్రియమును, బుద్ధియెఱుగదగిన । యేసుఖమనం
తమైనదో, యాసుఖంబు । దెలియుచున్నాడో, యెవ్వడు చలనమొంద ।
కుండునో తత్స్వరూపమునుండి మరల ॥ ౨౧ ॥ ...
దానిమించి । వేలయులాభతరంబును దలపలేడో । దేనియందునస్థితి
బొంది, తీవ్రదుఃఖ । ములనడుమనైన బొందడో చలనమొందు ॥ ౨౨ ॥
దుఃఖసంయోగములనుండి దొలగజేయు । దానిపేరును, దెలియుము
ధ్యానమనుచు । కుందులేనట్టిమనముచే కూర్పదగిన । దట్టియోగంబు
నిస్సంశయాత్మబుద్ధి ॥ ౨౩ ॥ పార్థ! సంకల్పమువలన బ్రభవమొందు ।
నాసలన్నియు మొదలంట నవలపిడిచి । సకలవిషయంబులగమన చల
నముడుగ । మనముచే నింద్రియగ్రామమును దెరల్చి ॥ ౨౪ ॥ ధృతి
ని చేబట్టి, బుద్ధిచేమతిని నాత్మ । యందె నిల్కడగనునట్టులమరజేసి ।
యుపరమముమెల్ల మెల్లగ నొందునట్లు । చేసి, మరియొద్దియును చిం
తసేయువలదు ॥ ౨౫ ॥ అస్థిరంబును చంచలమైనమనము । నేవిష

యములవర్తింప నేగుచుండు। నావిషయములనుండి బాయంగజేసి।
చేయవలె నాత్మయందు, సుస్థిరతనిల్వ ॥ ౨౬ ॥ శాంతమానసుడు
ను, రజశ్శాంతిగనిన। బ్రహ్మభూతుండు, పోయినపాపసమితి। గల్గిన
ట్టి యాయోగిని, కలయువేసకి। తానె బొందును పార్థ! యుత్తము
సుఖంబు ॥ ౨౭ ॥ నిరతమిటు మనము వశపరచుకొనిన, విగతక
ల్మషుడౌ యోగి, సుగమముగను। బ్రహ్మసంస్పర్శమనియెడు పరమ
సుఖము। పొందుచున్నాడు దేహంబునందెయుండి॥ ౨౮ ॥ యోగ
యుక్తాత్ముడైనట్టి యోగిగాంచు। దన్నుసర్వత్ర, సర్వభూతస్థునిగను।
నఖిలభూతములను తనయాత్మయందు। నంతటను సమదర్శనంబంద
నతడు ॥ ౨౯ ॥ ఎవడు సర్వత్ర జూచునో యెవ్వడునన్ను। నెపుడు
సర్వంబు నాయందు నెవడు జూచు। పార్థ! వానికి నేకనబడకపోను।
వాడుగూడ కనబడకపోడు నాకు ॥ ౩౦ ॥ ఎవడ భేదస్థితినిబొంది, యెల్ల
భూత। ములను నున్నట్టి నన్నెదా గొలుచుచుండు। నట్టియాయో
గి వర్తనమెట్టిదైన, వాడు నాయందె వర్తించువాడుమావె ॥ ౩౧ ॥
ఎల్లజీవులయందున నెవడు, సుఖము। దుఃఖమును, నాత్మదృష్టాంత
ముఖముజేసి। తుల్యముగజూచు, నాయోగి దొడ్డవాడు ॥ ౩౨ ॥

అర్జున—పలుకబడె యోగమేది నిశ్చలతచేత। నందదగివది, నీచేత, న
ట్టియోగ। మునకు తిరముగు నిలుగడ గనను నేను;। మనము చంచల
మౌటచేతను, రమేశ! ॥ ౩౩ ॥ చూడ చంచలమును, జాలక్షోభపెట్టు।
నదియు, బలవంతమును, దృఢమైనదియును। మనము, నదినిగ్రహిం
చుట ననిలనిగ్ర। హంబువలె, చాలదుష్కరమనుచు దలతు ॥ ౩౪ ॥

శ్రీభగ—సంశయములేదు, మనము చంచలము, నిగ్ర। హింపశక్యంబు
గానిదే, యిట్టులయ్యు। దిహిరి యభ్యాసబలమున, ద్రిప్పనగును। ప్రబ
లవైరాగ్యమునుబూని, బాహుశాలి! ॥ ౩౫ ॥ వశపడనియట్టి మదిగల

వానిచేత। ధ్యానయోగము పొందశక్యంబుగాదు। అర్జునా! నా
మతంబిది, యత్నమునను। వశపడినయట్టి మదిగలవానిచేత। పొం
దశక్యంబు, విడువనిపూనిక మొదలు। సాధనాంతరములచేత సవ్య
సాచి! ॥ ౩౬ ॥
అర్జున—ఆస్తికుండయి, నిగ్రహామంత లేక। యోగమందుండి చలితమై
య్యున్న మనము। గల్గువాడు, యోగఫలంబు గాంచలేక। యేగతి
నిబొందునో, కృష్ణ! యెఱుగజెప్పు ॥ ౩౭ ॥ ఉభయవిభ్రష్టుడై నాశ
మొందిపోడె? । చెదరుమేఘమువలె తనస్థితినిమాలి। బ్రహ్మపదవి
మార్గమందు, యోబాహుశాలి! ॥ ౩౮ ॥ అర్హుడవు కృష్ణ! యీసంశ
యంబ శేష। ముగను, దీర్పంగదీనిని మిగులకుండ। దోలునాతడు, నీ
కంటె దొడ్డవాడు। బొత్తిగాదొరకడుగద బుధవరేణ్య! ॥ ౩౯ ॥
శ్రీభగ—పార్థ! వానికి నిహమున పరమునందు। కలుగనేరదు నాశం
బు, కలుగబోదు। మంచికార్యములను తండ్రి! మరిగిచేయు। వా
డు దుర్గతికెవ్వడు బోడుచూవె ॥ ౪౦ ॥ యోగమందుండి జారిన
యోగి, పార్థ!। పుణ్యమొనరించువారలు బోవులోక। ములకుతానే
గి, యటభోగములను పెక్కు। హాయనంబులుభోగించి, యవలబు
ట్టు। శుచియు నైశ్వర్యమునుగల సుభగులింట ॥ ౪౧ ॥ అట్లుకాకున్న
ధీమంతులైనయోగి। వరులకులమందె, జన్మించు పార్థ! యతడు।
యిహామునందిట్టి పుట్టుకపడికలదో। యదియె గడుదుర్లభంబైనయ
ది, కిరీటి! ॥ ౪౨ ॥ అచట, యోగికులంబున, నతడు మరల। పూర్వ
దేహసంబంధమా బుద్ధిబొంది। దాన, సంసిద్ధికై బ్రయత్నంబుజే
యు। పెంపుగను, కురునందన! విడువకుండ ॥ ౪౩ ॥ వాడు వెనుకటి
యభ్యాసవశమువలన। నవశమానసుడయ్యును, నధికముగను। నవల
నీడ్వగబడు, విషయములనుండి। యోగజిజ్ఞాసచేతనే యోగితాను।

గడచుచున్నాడు, వేదోక్తకర్మములను ॥ ౪౪ ॥ పట్టుదలతోడనాయో
గి పాటుబడుచు । యవలసంశుద్ధకిల్బిషుండై, యనేక । జన్మసంసిద్ధి
నుత్తమస్థానమొందు ॥ ౪౫ ॥ పార్థ! యధికుడు యోగి తపస్వికం
టె । తలపబడు నధికుండని తత్వవేత్త । కంటె గూడను, నధికుడౌ క
ర్మజేయు । చుండువారికి గావున, యోగివగుము ॥ ౪౬ ॥ అంతరా
త్మను నాయందు ననువుపరచి । యెవడు సద్భక్తినను భజియించుచుం
డు । యోగులందరిలోన నాయోగిమిగుల । యుక్తతముడనియెంచెద
నోయి నేను ॥ ౪౭ ॥

ఇది ఆత్మసంయమనయోగంబను షష్ఠాధ్యాయము.

---

## సప్తమాధ్యాయము.

---

శ్రీభగ—మరిగి నాయందు దగిలిన మనముగలిగి । యాచరించుచు యో
గంబు, నాశ్రయముగ । నన్నెజేకొని, సంశయనాశనముగ । నఖిలగు
ణపరిపూర్ణుండనైననన్ను । నెట్లు తెలిసెదవో, దానినెరుగవినుము ౧॥
శేషమేమియు లేకుండ జెప్పగలను । స్వానుభవసాధనంబగు జ్ఞానమి
వుడు; । దేనిదెలిసినపిమ్మట, తెలియదగిన । దన్యమిందేమి మిగులదో
యదియునీకు ॥ ౨ ॥ నరసహస్రంబులో నొకనరుడు, నాత్మ । సిద్ధికై
ప్రయత్నంబును జేయు; నటుల । యత్నమును జేయు సిద్ధులయందొ
కండు । తెలియువాస్తవముగనన్ను, తెలివితోడ ॥ ౩ ॥ భూమి, జల,
మగ్ని, వాయువు, వ్యోమతలము । మనము, బుద్ధి, యహంకారమ
నుచు, నిట్లు । ప్రకృతి భేదింపబడు, నష్టభాగములుగ ॥ ౪ ॥ ఇదినికృ

ష్టంబు, దీనికి నితరమైన। ప్రకృతి, యుత్కృష్టమైనది, ప్రాణధార।
ణకు నిమిత్తభూతము, నిదినాయధీన। మీజగము దీనిచేధరియింపబడు
ను ॥ ౫ ॥ తెలియుమోపార్థ! యీరెంటివలన గలుగు। సర్వభూతంబు
లని, నేనె సర్వజగము। పుట్టుటకు నాశనంబును బొందుటకును।
కారణంబను, ప్రకృతులద్వారమునను ॥ ౬ ॥ పార్థ! నాకంటె నన్యంబు
పరతరంబు। నైనకారణ మేమాత్రమైన లేదు। కువలయంబెల్ల నాయందు
గూర్పబడియె। దారమున మణిగణములు చేరినట్లు ॥ ౭ ॥ అంబువులరు
చి, రవిచంద్రులందు కాంతి। ధ్వనియు మింటను, సర్వవేదంబులందు।
ప్రణవము, మనుష్యులందున పౌరుషంబు। నోయికౌంతేయ! నేనయై
యున్నవాడ ॥ ౮ ॥ పరిమళించెడు గంధంబు వసుధయందు। నగ్ని
యందు ప్రకాశంబు, నఖిలభూత। ములను జీవనమును, మరిమునుల
యందు। తపము, కౌంతేయ! నేనయై తనరువాడ ॥ ౯ ॥ అర్జునా!
తెలియుము, నిత్యుడైన నన్ను। భూతములకన్నిటికి బీజభూతునిగను।
బుద్ధిమంతులదైన యాబుద్ధి నేనె;। తేజమును గలవారల తేజమేనె॥
౧౦॥ ఆశయును ననురాగంబు నంటనీని। బలము గల్గినవారల బలమునే
ను। ప్రాణులందున, ధర్మంబు బాయనట్టి। యాశయును, భరతర్ష
భ! యగుదు నేనె; ॥ ౧౧ ॥ సాత్త్వికము రాజసము తామసములు నన
డు। భావముల వేవొ, యవియు నావలనగలుగు। ననుచుదెలియుము
నేవానియందు లేను;। నవియు నాయందమున్నవి, యణగి, పార్థ! ॥
౧౨॥ త్రిగుణమయ భావములచేత జగమదెల్ల। మోహితంబాయె,
గుణములు మూటికంటె। పరుడ నవ్యయుడగునన్ను, నెరుగలేదు ॥
౧౩॥ దైవికము, త్రిగుణాత్మక, మీవదింప। బడిన నామాయ, దాటంగ
గ బహ్వాశక్య। మెవరు, నన్నేశరణమును, నెపుడుబొంది। దలతురో
వారలీమాయదాటగలరు ॥ ౧౪ ॥ పాపములు జేయువారును, పామరు

లును। మాయచేజ్ఞానమును గోలుపోయినట్టి। యధములాసురభావం
బు నాశ్రయించి। పొందలేరెన్నడును, నన్ను బురుషవర్య! ॥ ౧౫ ॥
అర్తుడును, మరిజిజ్ఞాసుడర్థకామి। జ్ఞానియును, చతుర్విధపుణ్యశాలు
లైన। జనులు, భజియించుచుందురు సతము నన్ను ॥ ౧౬ ॥ వారిలో
నిత్యయోగియు, పరమభక్తు। వరుసునొజ్ఞాని; యధికుడై బరగుచుం
డు। జ్ఞానికత్యంతప్రియుడను నేను పార్థ!। ప్రియతముడునాకు నా
జ్ఞాని, వినుతశూర ॥ ౧౭ ॥ అందరును దారులే వీర, లందులోన।
జ్ఞానినేనేయనుట నాకు సమ్మతంబు। నటులనేలన, యుక్తాత్ముడైన
వాడు, గాంచె సర్వోత్తమంబైనగతిని నన్నె ॥ ౧౮ ॥ జన్మములు
పెక్కులేగిన, జ్ఞానసిద్ధి। వడసి సర్వంబు వాసుదేవస్వరూప। మ
నుచునన్ను తాబొందెడు, నామహాత్ము। డర్జునా గడుదుర్లభుం
డవనియందు ॥ ౧౯ ॥ తమతమస్వభావములకు దగులువడిన, జనులు
పలువిధకామంబులనుసరించి। వానిచేతను నపహృత జ్ఞానులగుచు।
నితరదేవతలను భజియించుచుందు। రందుకునుదగునియమంబులను
సరించి ॥ ౨౦ ॥ ఎవ్వడెవ్వడు, భక్తుడై, యేదియేది, దేవతావిగ్రహం
బును దివిరిపూజ। చేయగోరునో, శ్రద్ధతో, స్థిరముగలది। గాను
నాశ్రద్ధజేయుచున్నాను నేను ॥ ౨౧ ॥ అట్టివిశ్వాసమున నాతడట్టిపూ
జ। నలుపుటకు నిచ్ఛయించును, ఫలము నేను। నిట్టిదని నిర్ణయింపగ
హితమునైన। కోరికలబొందు, తాగొల్చువారివలన ॥ ౨౨ ॥ దేవత
లగొల్చువారలు దేవలోక। ములకుబోవుదు, రల్పబుద్ధులఫలంబు।
లంతవంతములగు; నామ నను గుభక్తు। లొందుదురునన్నె కౌంతే
య! యొప్పగాను ॥ ౨౩ ॥ అవ్యయము, నధికంబు, నిరతిశయంబు।
నైన నాస్వరూపంబు దామరయలేని। యజ్ఞులవ్యక్తుడౌ నన్ను, నఖి
లరూప। యుకునిగ, తాముతలచుచు నుందు రెపుడు ॥ ౨౪ ॥ అంద

రికిని నేఁబత్యక్షమైనవాఁడ। గాను; యోగమాయవలన గప్పబడుట।
నెరుఁగనేరదు మూఢమా నీప్రపంచ, మనయయమునునన్ను నజునిగ న
వ్యయునిగ ॥ ౨౫ ॥ గడచినవి, కలుగుచున్నవి, కలుగఁబోవు, భూత
ములనన్నిటిని నేను పురుషవర్య!, యెఱుఁగుదును, నన్ను నొకఁడు
నెఱుఁగఁడనఘ! ॥ ౨౬ ॥ వాంఛచేతను; క్రోధంబువలనఁబుట్టు, ద్వం
ద్వమోహంబుచేత, భూతంబులెల్ల। బొందుచున్మోహమును, పార్థ
పుట్టినపుడె ॥ ౨౭ ॥ పుణ్యకర్మలఁజేయు నేపుణ్యజనుల, పాపమంత
ముఁబొందునో, వారు పార్థ!, ద్వంద్వమోహంబుతో విముక్తులను
బొంది। భజనచేతురునన్ను, దృఢవ్రతులునగుచు ॥ ౨౮ ॥ ఎవరు సత
తంబు నన్నాశ్రయించి, జరయు, మృతియు బాయుబ్రయత్నంబు మి
గులఁజేతు, రట్టివారలు బ్రహ్మంబు, నఖిలకర్మ। సరణి, నధ్యాత్మన
ర్వస్వ, మెరుఁగుచుండ్రు ॥ ౨౯ ॥ ఎవ్వరధిభూత, మధిదైవ, మిటుల
నె యధి। యజ్ఞములతోడ, గూడియున్నట్టినన్ను। తెలియుచున్నారొ
వారలే తెలియఁగలరు, యుక్తచేతస్కులై, నన్ను నొప్పమీర। చచ్చు
తరియందుసైతము సవ్యసాచి! ॥ ౩౦ ॥

ఇది విజ్ఞానయోగమను సప్తమాధ్యాయము.

———:o:———

## అష్టమాధ్యాయము.

———

అర్జున—ఏది యా బ్రహ్మ మధ్యాత్మమేది కృష్ణ?, ఎట్టిదా కర్మ మధి
భూతమేదియగును? । అందు రెద్దాని నధిదైవమనుచు కృష్ణ? ॥ ౧ ॥
ఎవ్వఁడధియజ్ఞుఁడో కృష్ణ! యీశరీర। మందు? నెవ్విధిదెలియంగన

గునొయించు? । చచ్చుతరి నియతాత్ముడా జనునకీవు । తెలియదగు దెట్టులదియును దెలియజెప్పు ॥ ౨ ॥

శ్రీభగ—అక్షరంబగు, బ్రహ్మ నిరతిశయంబు । నాపరబ్రహ్మభావ మ ధ్యాత్మమగును । ప్రాణభూతములకు నుద్భవకరమైన । యలవిసర్గమె కర్మమై యలరుచుండు ॥ ३ ॥ పార్థ! నశియించునట్టి భావములునగు ను । దాము నధిభూతముగ, నధిదైవతంబు । భూతముల కావికర్త యా పురుషుడగును । అగుమనీదేహమున నధియజ్ఞమేను ॥ ४ ॥ అ ర్జునా! మరణము నొందునపుడుగూడ । ఎవడు నన్నె స్మరించుచు, నీశరీర । మును విసర్జించి వెడలునో, విసుము వాడు । పొందుదాన న్నె సంశయంబింత లేదు ॥ ५ ॥ ఎవ్వడేయే స్వరూపంబు, నెదను దల్చి । విడుచునో తన్వు, తాను భావించునట్టి । యల్ల యాయాస్వరూపంబు నందుచుండు ॥ ६ ॥ అందుచే సర్వకాలంబులందునన్నె । చింత సేయుచునుండుము, చేయుమాజి పార్థ । నాయందు నర్పించబడినమన ము । బుద్ధియును గల్గియుండిన నన్నె పొందగలుగు । దెంతమాత్రముసంశయ మింతలేదు ॥ ७ ॥ తవిలి యభ్యాసయోగయుక్తమును, నన్య । గామియును, గానిమనముచే, కవిము, దివ్య । మౌ, పరమపురుషుని, ననయంబు, చింత । జేయునాతడు, బ్రహ్మంబు జేరగలడు ॥ ८ ॥ సర్వలోకనియామకు సర్వవిదుని । యణువుకంటెను సూక్ష్మమై యలరువాని । నఖిలజగము నకాధార మైనవాని । తలప శక్యంబు గానట్టితనువువాని । బ్రహ్మ, నాదిత్యవర్ణుబురాణపురుషు, । నెవడు, మాయాంధకారగ హితునిదా ను । జింత సేయుచునుండునో, యంతతంబు ॥ ९ ॥ అంత్యకాలంబునందు న, నచలమైన । మనముచే, భక్తిచే, యోగమహిమచేత । నల్ల ప్రాణంబు భ్రూమధ్యమునందు జేర్చి । పరమపురుషుని నెవ్వడుస్మరణజేయు । నాత డాదివ్యపరమాత్మునందు చుండు ॥ १० ॥ పరిభుక్షరమందు రో వే

దవిదు లు। రాగము నువిడిచిన యతిరాజులంత। దేని బొందుదురో, దాని
దెలియగోరి।యాచరింతురో బ్రహ్మచర్యవ్రతంబు, నాపదమును సంగ్ర
హంబుగ నానతిత్తు. ॥ ౧౧ ॥ ఇంద్రియంబుల నియమించి,హృదయ
కమల।మందు మనమును నరిగట్టి,యవలతనదు।ప్రాణవాయువు శిర
మునపాదుకొల్పి,।యవలయోగ ధారణమును నాశ్రయించి।౧౨॥
ఓంమ్మనెడు బ్రహ్మవాచక ముచ్చరించు। కొనుచు నన్నే స్మరింపుచు
తనువువిడిచి। యరుగునెవ్వడు,వాడొందు పరమగతిని ॥౧౩॥ అన్యవిష
యంబులందున నంటనట్టి।మనముగల యోగియెవ్వడు,మదినినన్నే।
యెడతెగక చింత సేయుచు నెపుడు నుండు। నాసమాహిత చిత్తుడౌనట్టి
యోగి। పరుడు, సులభముగా,బొందు పార్థనన్ను ॥౧౪॥ పొందినన్ను
మహాత్ములు పొందుచుంద్రు। పరమసంసిద్ధి, యెన్నడు తిరిగివారు! దు
రలముఃఖాలయంబు,నస్థిరమునైన। జన్మమును,బొందనేరరు; సవ్యసా
చి ॥౧౫॥ బ్రహ్మలోకము తోడను, బహుళమైన। భువనములు, పున
రావృత్తిబొందియున్న। యర్జునా! నన్నుబొందిన జ్ఞానమరల। పుట్టు
టయొకలుగ నేరదు, పురుషవర్య ॥ ౧౬ ॥ ఎవరహోరాత్రముల సం
ఖ్యనెరిగినారో। వారునొక వేయి యుగములు పరిమితిగల। కాలమహా
ధాతకు పగటికాలముగను। యుగసహస్రంబుగడచిన నొకటిరాత్రి।
పరిమితిగ, దెలియుచుందురు పార్థ! వారు ॥ ౧౭ ॥ పవలువచ్చినతో
డనే ప్రభవమొందు। వ్యక్తభూతములన్నియవ్యక్తమైన। ప్రకృతియం
దుండి, రాత్రియురాగనపుడు। నణగునవ్యక్త మహామాయ యందు
మరల ॥ ౧౮ ॥ పూర్వకల్పము నందలిభూతవర్గ। మంతయును పు
ట్టిపుట్టిదామణగుకర్మ। వశమునను, రాత్రిరాగానె పార్థ! మరల।
పవలువచ్చిన తోడనె, ప్రభవమొందు ॥ ౧౯ ॥ కాన నవ్యక్తమహా
మాయ కంటెనన్య। మైనదియు, నుత్తమంబైనయదియు, నింద్రి।

యములకును గానబడని, యనాది మూర్తి । గలదు, సర్వభూతంబులు విలయమొంది । చెడిన, తానింత యేనియు చెడదు పార్థ! ॥ ౨౦ ॥ ఆతడవ్యక్తుడక్షరుండనగబరగు;। పరమగతి గాగనాతని బల్కు-చుండ్రు దేనిబొందిన ,జన్మసుతిరిగిరారో । యట్టిపరమధామము, నాదియగును పార్థ!॥౨౧॥ పరమపురుషు, డనన్యమాభక్తి చేత । పొందదగినట్టియా తడు, భూతవర్గ । ముసకునాధార మగువాడు, మజ్జగముల । నంతట నునిండియున్న వా, డాత్మయగుచు ॥౨౨ ॥ సమయ మెద్దానబో యిన, జ్ఞానయోగు । లరుగుమరొజన్మరాహిత్యమందియటులె । కా లమెద్దా నబోయినకర్మయోగు । లరుగుమరొజన్మనుంసగ, నదియునీ కు । విభజనముచేసి చెప్పెదవినుము పార్థ ॥౨౩ ॥ అగ్నియుం, జ్యో తి, పవలును, నటులెశుక్ల । పక్షమును, నారుమాసముల్వరిమితిగల । యుత్తరాయణమందున, నొడలువిడుచు । బ్రహ్మోపిమలైనజనములు బ్రహ్మమునకు । పోవుచున్నారు ఫల్గున! పోవునపుడు ॥ ౨౪ ॥ పా ర్థ! ధూమము, నిశ, కృష్ణపక్ష, మటుల। నారునెలలదౌ దక్షిణాయన మునందు । కర్మయోగులు జని చంద్రకాంతినంది । మళ్లుచున్నా రువ సుధపైమరల బుట్ట ॥౨౫॥ శుక్లకృష్ణంబు లివిరెండు సుగతులుభువి। శాశ్వతంబులునని నామసమ్మతంబు। దీననొకర్కటిమూను చుతిరిగిరా క । యుండుటను బొందునన్యంబు నొందిమరల । వచ్చుచున్నాడు జన్మంబు వడసిరుడు ॥౨౬ ॥ ఇట్లుచెప్పగబడినట్టి యీగతులను । దానెరుగుయోగి, పొందడీ ధరణియందు । మోహమేమాత్రమును గాన, మోహమెడలి । కమ్మ యోగయుక్తుడ వెల్లకాలములను॥౨౭॥ వేదయజ్ఞత పో దానవివిధపుణ్య । కర్మఫలములనీ యోగిగడచుచుండు।

నివిమోగాకుండ, నీయర్థమెరిగివాడు। నాద్యమాపగస్థానంబు, నంద
గలడు ॥౨౮॥

ఇది । అక్షరపర బ్రహ్మ యోగమనెడు అష్టమాధ్యాయము

నవమాధ్యాయము.

శ్రీభ—ఎరిగిదేనిని యశుభంబు నెల్లవిడువ । జాలుదువో, గుహ్యతమము
విజ్ఞానసహిత । మైననీజ్ఞానము, ననూయనందనట్టి । నీకు, జెప్పెద
లెస్సగానిర్మలాత్మ ॥ ౧ ॥ రాజువిద్యలలో నెల్ల, రాజగుహ్య । ము
ను, పవిత్రంబు, నుత్తమమును, సుధర్మ । సహితమును, సులభమైనది
సలుపుటకిది । స్వానుభవ మిచ్చునదియు, నాశర హితంబు ॥౨॥
జ్ఞానధర్మంబు విశ్వసించని పురుషులు। పార్థ! నను బొందక తిరిగి ప
డుచునుంద్రు। మరణరూపమా సంసారమార్గమందు ॥ 3 ॥ ఈజగ
మశేషమును పార్థ! యింద్రియములు। చూడగా లేనిరూపంబుతోడ
గూడి । యున్ననాచేత, వ్యాప్తమైయున్నయదియు । నిల్చియున్నవి
నాయందు నిఖిలభూత। ములును, నేలేను వానిలోపలను పార్థ!౪॥
తగిలియున్నవికావు భూతములునన్ను । చూడు నాయోగశక్తిని సు
భగచరిచ! । పార్థ! నాయాత్మరూపము ప్రాణివర్గ। మును భరించు
చు, పోషించుచును, దగులను । అదియు భూతంబులందున్నయదియు
కాదు ॥ ౫ ॥ వ్యాప్తమై యంతటను మహావాయువెట్లు । నిత్యమును
మింటనున్నదో నిల్చి, యటులె । పార్థ! నాయందునున్నవి ప్రాణు
లన్ని ॥ ౬ ॥ పార్థ! భూతములన్ని కల్పాంతమందు। పొందుచున్నవి

నామాయయందు మరల। వానినే సృజియింతు కల్పాదియందు ౭॥
సృష్టిజేతును నామాయ స్వీకరించి। యస్వతంత్రమైయున్న యీ
యఖిలభూత। సర్గమును, మాటిమాటికిబ్రకృతివశత; ॥ ౮ ॥ మరియు నా
కర్మముల నఖిమానమింత। పొందకుండ, నుదాసీనుబోలునన్ను। పా
ర్థ! బాధింపనేరవాపనులు వినుము ॥ ౯ ॥ సాక్షిమాత్రుడనైన నాస
న్నిధాన। వశమున, చరాచరంబుల బ్రకృతిగనుచు। నున్న, దిటు
సాక్షినాదు, నేనుండబట్టి। జగము వర్తింపుచున్నది, సవ్యసాచి! ౧౦॥
నాపరమతత్త్వమును, భూతనాయకత్వ। మును, నెరుంగని మూఢులు,
మనుజతనువు। స్వీకరించిన, నను, జులకచేతురుగద ॥ ౧౧ ॥ వ్యర్థమా
నాసలును, గడు వ్యర్థకర్మ। వ్యర్థమా జ్ఞానమును, గల్గినట్టిమూఢు।
లాసురంబును, రాక్షసంబైన, మోహి। నీస్వరూపంబునౌ, మాయ
నెమ్మిగొల్చి। నన్నవజ్ఞను జేయుచున్నారు, వారు ॥ ౧౨ ॥ పార్థ!
సాత్త్వికదేవస్వభావమాశ్ర। యించు, సుమహాత్ములీభూతసంచయ
ముల। కాదికారణమును, నవ్యయంబునైన। నన్ను, దెలియుచు, సే
వించుచున్నవారు। మనమునను, వేరుచింతలు మసలనీక ॥ ౧౩ ॥ పా
ర్థ! విజితేంద్రియులు, దృఢవ్రతులు, నిత్య। యుక్తులును, నన్నుగీర్తిం
చి భక్తితోడ। మరిగి సేవింపుచుంద్రు, నమస్కరించి ॥ ౧౪ ॥ జ్ఞాన
యజ్ఞంబుచేతను, నాదుపూజ। సలుపుచుందురు కొందరు, కొలుతు
రందు। గొందరేకత్వముగ, మరికొంతమంది। భేదభావన, గొందరు
వివిధములుగ। విశ్వతోముఖుడవినన్ను వినుతిజేసి ॥ ౧౫ ॥ క్రతువులు
ను నేను, యజ్ఞకర్మంబు లేను। శ్రాద్ధదత్తాన్నమేను, నోషధులు నేను।
నేనె మంత్రస్వరూపుడ, నేయి నేనె। నేనె యగ్నిని, హుతమును,
నేనె యగుదు ॥ ౧౬ ॥ జనకుడను నేను, పార్థ! యీజగమునకును।
తల్లియును, పితామహుడను, ధాత, తెలియ। వలసినట్టి వంటి పా

వనవస్తువేనె। పార్థ! ఋగ్యజుస్సామముల్ ప్రణవమేనె ॥ ౧౭ ॥ కర్త
ఫలమును, భర్తయు, కర్మసాక్షి। ప్రభుఁడు, శరణంబు, సుహృదుఁడు,
ప్రాణులకుని। వాసము, సృభవస్థితి, ప్రళయకర్త। యగయనిక్షేప
మవ్యయాంకురమునేనె ॥ ౧౮ ॥ వేడినిత్తును, భువి గురిపింతువాన।
నిగ్రహింపుమ, నమృతంబునేనె, పార్థ! నేనెమృత్యువు, సదసత్తులేనె
సుమ్ము ॥ ౧౯ ॥ ఎవరు వేదత్రయంబును నేరిగి, సోమ। పానమును
జేసి, నిర్ధూతపాపులగుచు। యజ్ఞములనన్ను సేవించి, యరుగ దివి
కి। వాంఛచేతురో, వారలాస్వర్గమంది। యచట దివ్యభోగంబుల
నందుచుంద్రు ॥ ౨౦ ॥ వారును విశాలమా స్వర్గపదవి సుఖము। ల
నుభవించియు, నాపుణ్యమంతమైన। మనుజలోకములోదిగి, మరల
వేద। ధర్మమును నాశ్రయింపుచు దవిలి యిచ్చ। గాంచుచున్నారు
రాకపోకలనువారు ॥ ౨౧ ॥ పజనులనన్యబుద్ధితో నెపుడునన్ను। స్మర
ణచేయుచు ధ్యానంబు సలుపుచుందు। రాసమాహితచిత్తులైనట్టివారి।
కైనయోగము క్షేమంబు నరయుదేను ॥ ౨౨ ॥ అన్యదేవతాభక్తు
లైనట్టివారు। శ్రద్ధనెవ్వరు పూజలసల్పుచుంద్రో। వారుకూడను,
క్రమమార్గదూరులగుచు। భజనమును జేయుచుందురు పార్థ! నన్నె॥
౨౩ ॥ నేనె భోక్తను, ప్రభుఁడను, నిఖిలయజ్ఞ। ములకు, తత్వంబు
చేదీని దెలియలేరు। వార, లందుచే జారుచున్నారు పార్థ! ॥ ౨౪ ॥
దేవతల బొందుచున్నారు దేవతలను। గొల్చువారలు, పితరులగొ
ల్చువారు। పొందుచున్నారు పితరుల, భూతములను। పూజసేసె
డివారలు భూతములను। పొందుచున్నారు, మరినన్ను పూజజేయు।
వారుపొందుచునున్నారు పార్థ! నన్ను ॥ ౨౫ ॥ ఎవఁడు నామీదిభక్తిచే
నిచ్చువాకు। పత్రమును, పుష్పమును, నీరు, ఫలమునైన। నేనునాభక్తి
పూర్వకమైన యట్టి। యర్పణము చాలనాసక్తినారగింతు ॥ ౨౬ ॥

దేనిచేతువో, తింటువో, దేనిపార్థ!। దేనివ్రేల్తువో, యిత్తువో, దే నిదాని। నేతపంబును జేయుదువా తపంబు। నాచరింపుము నాకు స మర్పణముగ ॥ ౨౭ ॥ ఇటుశుభాశుభ ఫలముల నెల్లవిడిచి। కర్మబం ధంబునందుండి గడవగలవు। తవిలిసన్న్యాసయోగయుక్తాత్ముడవయి। పొందెదవునన్ను, దేహంబుపోయినంత ॥ ౨౮ ॥ సర్వభూతంబులకు నేనుసముడ, నాకు। శత్రువును లేడు, లేడెందు మిత్రుడైన। నన్ను నెవ్వరుభక్తితో నమ్మిగొల్చు। చుందురో, వారియందు నేనుందు పార్థ! ॥ ౨౯ ॥ పార్థ! మిగులను రాచారవంతుడైన। నితరులను గొల్వకుండగ నెపుడు నన్నె। సేవజేసిన యాతడు, శ్రేష్ఠుడగును;। స్థిరమనోనిశ్చయంబును జెందియుంట ॥ 30 ॥ శీఘ్రముగ ధర్మమం దున చిత్తముంచి। శాంతిననయంబుబొందెడి సాధు వరయ। చెడ డు, నాభక్తుడెవ్వడు సిద్ధమిదియ। తెలుపవచ్చును నిదియు, బ్రతిజ్ఞ జేసి ॥ 3౧ ॥ ఇంతులును, వైశ్యులును శూద్రులిటులె మరియు। పా పయోనులబుట్టిన పాపులైన। బొందుదురు, నిశ్చయంబుగ, ముక్తి పదవి। పార్థ! యాధారముగను, జేపట్టినన్ను ॥ 3౨ ॥ పల్కవలె న య్యపుణ్యులౌ బ్రాహ్మణులును। భక్తియుక్తులౌ రాజర్షివర్యులెపు డు। నుత్తమస్థానమును, బొందుచుందురనుచు?। శాశ్వతముగాని, యసుఖమౌ జగముదీని। బొంది, నన్నేభజింపుము పురుషవర్య!33॥ నిల్పు నామీద, నీమది, నిరతమీవు। అగుమునాభక్తుడవు, మరియా గములను। చేయుచుండుము ననుగూర్చి, చేతులెత్తి। మ్రొక్కుమీ నాకు, శరణని, మక్కువలర। ఇటుల నీయాత్మ నాయందు నెపు డుగూర్చి। పొందెదవునన్ను నర్జున! పొలుపుమీర ॥ 3౪ ॥

ఇది రాజవిద్యారాజగుహ్యయోగమను నవమాధ్యాయము.

## దశమాధ్యాయము.

శ్రీభగ—మరలవినుమర్జునా! నాదు పరమవచన। మెరుగజెప్పెద, నే
నుసీహితముగోరి। కుతుకమున బొందుచున్న నీకొరకు పార్థ! ॥౧॥
సురగణమును, నాప్రభవము నెరుగలేరు। అర్జునా! యెరుగరు నాదు
మహర్షులైన। నన్నివిధముల నే నామహర్షులకును। సురలకును తొలివా
డనై బరగువాడ ॥౨॥ ఎవడనాదిగ, నజునిగ నెల్లలోక। ములకు
ను మహేశ్వరుడుగ, దెలియునన్ను। నరులయందున, వాడు నజ్ఞా
నమెడలి। బాయుచుండును సర్వపాపముల పార్థ! ॥౩॥ బుద్ధియుం
జ్ఞానమును, నసమ్మోహనంబు। క్షమయు, సత్యంబు, దమమును, శ
మము, సుఖము। నార్తి, యుత్పత్తి, నాశ, భయాభయములు ॥౪॥
హింసలేమి, సమత్వంబు, నిటులె తుష్టి। తపము, దానము, యశము
ను, నపయశంబు। ననెకు భూతస్వభావంబులన్ని పార్థ!। పలువి
ధంబుల గలుగునావలన ననఘ! ॥౫॥ వెనుకటి మహర్షు లేడ్వురు,
సనకుడాది। యైననల్వురు, మనువులునటులె, నాస్వ। భావమున
మానసంబున బ్రభవమొంది। నారు, వారలచే బుట్టినదియె పార్థ!।
జగమునందలి యీప్రజాసంఘమంత ॥౬॥ ఎవుడు నెవ్వాడు నాదగునీ
విభూతి। యోగముల, నిజముగ, వాడు వేగగూడి। బడు నకంపిత
యోగంబువలన, దీన। సంశయమొకించుకయు లేదు సవ్యసాచి! ॥౭॥
జగములకు నెల్ల నుత్పత్తిజరుపువాడ। నేనె, నాయందు జగములు ని
ల్చితిరుగు। నిటులదలది భావయుక్తులై యెపుడునన్ను। బుధులు భజి
యించుచున్నారు పురుషవర్య! ॥౮॥ చిత్తమును జేర్చి నాయందు జీ
వనముల। నొప్పగనునాకు నొప్పించి, యొకరికొకరు। బోధజేయు
చు కీర్తించి, బుధులనిశము। నలరుచుందు రానందంబునందుమిగుల ॥౯॥

నిత్యయుక్తులై విశ్వాసనిరతులగుచు । బూజ జేసెడివారికి, బుద్ధియో
గ । మిచ్చెదను నేను, దానవారెల్ల నన్ను । బొందుచున్నారు తమయా
త్మలందు పార్థ! ॥ ౧౦ ॥ వారల ననుగ్రహింపగ వారియాత్మ । భా
వములనుండు నట్టినే భాసమాన । జ్ఞానదీపంబుచేత నజ్ఞానజనిత । తమ
మునశియింపజేయుదు, విమలచరిత! ॥ ౧౧ ॥

అర్జున — నీవె యాపరబ్రహ్మము, నిత్యుడవును । పరమధాముడవు, పరమ
పావనుడవు । దివ్యుడవు, పురుషుడ, వాదిదేవుడవును । నన్నిటికివిభు
డవు, మరియజుడవనుచు ॥ ౧౨ ॥ అనిరి మునులెల్ల, నటె, దేవముని
యునైన । నారదుడుబల్కె, నటులనె జ్ఞానియైన । వ్యాసుడును బ
ల్కె, దేవలుడనియె నటులె । నసితుడనెనట్లు, నీవును నంటివట్లు ॥ ౧౩ ॥
ఏది జెప్పితివో నాకు, నిదియునంత । సత్యముగ నమ్ముచున్నాను, సగుణ
రూప! । దేవదానవులైనను దెవనీదు । వ్యక్తి నెరుగరు గద కృష్ణ! వా
సుదేవ! ॥ ౧౪ ॥ నీవు నీ జేతనే నిన్ను నిశ్చయముగ । నెరుగుచుంటివి
యుత్తమపురుషమూర్తి! । భూతభావన! భూతేశ! భూతవంద్య! । దేవ
దేవ! జగత్పతీ! దివ్యరూప! ॥ ౧౫ ॥ చెప్పుటకు తగుదువు, నీవశేషము
గను । దేవ, యాత్మవిభూతుల, దివ్యములను । ఏవిభూతులచే నీవు
నీజగముల । నున్నవాడవో, వ్యాపించి, సన్నుతాత్మ! ॥ ౧౬ ॥ ఎట్లు
దెలియుదునో యోగి! యెల్లపుడును । ధ్యానమును జేయుచును, నిన్ను
దత్త్వమూర్తి! । యెందు, నేభూతములయందు, నెపుడు నీవు । చింత
జేయగదగుదు, నాచేత దేవ! ॥ ౧౭ ॥ ఓ జనార్దన! నీయొక్క యో
గమును, వి । భూతియు, సవిస్తరంబుగ బూని మరల । నానతీయవె,
నీదు వాక్యామృతంబు । జెవులవిను నాకు సంతుష్టి జేరదయ్యె ॥ ౧౮ ॥

శ్రీభగ — చెప్పెదను ముఖ్యముగ, కురుశ్రేష్ఠ! నీకు । దివ్యములు నావిభూ
తుల, దెలియునట్లు । తుదయెగల్గదు నావిభూతులకు పార్థ! ॥ ౧౯ ॥

సర్వభూతహృదంతర సన్నివిష్ట। ప్రత్యగాత్మను, నేనైబరగుచుం
దు। యిట్టిభూతంబులకు గుడాకేశ! మరియు। నాదిమధ్యాంతము
లునేనె యగుచునుందు ॥ ౨౦ ॥ విష్ణుడను నేనె, సురలందు వినుము
పార్థ! । కాంతినిచ్చెడివారిలో ఖరకరుడను। వాయువులలో మరీచి
ని, పార్థ! నేను। శశధరుండను నేను నక్షత్రములను; ॥౨౧॥ వేదముల
సామవేదంబు, వేల్పులందు। వాసవుడ, నింద్రియంబుల పార్థ! మనము।
భూతముల జేతనము నేను, పురుషవర్య! ॥ ౨౨ ॥ శంకరుడ రుద్రగ
గణముల, సవ్యసాచి! । ధనదుడను యక్షరాక్షసదనుజులందు। నష్ట
వసువులలోపల నగ్ని నేను। పర్వతములందు మేరుపర్వతము నేను ॥
౨౩ ॥ అలపురోహితులందు ననధికుడైన। యాబృహస్పతినౌను, సే
నాధిపతుల। స్కందుడను, సరసులయందు సాగరుడను ॥ ౨౪ ॥ అ
ర్జునా! నేనుమహర్షులయందు భృగుడ। వాక్కులందున నొకటియా
ప్రణవమేను। యజ్ఞములలోన జపయజ్ఞమగుదు నేను। నచలములయం
దు నేను హిమాలయంబు ॥ ౨౫ ॥ సర్వవృక్షంబులందు నశ్వత్థమేను।
పార్థ! నేనారదుడను దేవరుషులందు। చిత్రరథుడ గంధర్వుల, సిద్ధు
లందు। కపిలుడను మహాముని నౌదు, కలుషరహిత! ॥ ౨౬ ॥ సాగ
రోద్భవమైన యుచ్చైశ్శ్రవసము। నశ్వములలో, గజేంద్రులయందు
నేను। పార్థ! యైరావతము, మహీపాలకుడను। నరులలోపల దెలి
యుమీ నన్ను నిటుల ॥ ౨౭ ॥ ఆయుధంబులలోన వజ్రాయుధంబు।
ధేనువుల కామధేనువు, నేనెయగుదు। ప్రజలబుట్టించునట్టి దర్పకుడ
నేను। వాసుకిని సర్పములలోన, పార్థ! నేను ॥ ౨౮ ॥ నేననంతుడ
నాగుల, నీరవాసు। లందు వరుణుడ, పితరులనర్యముండ। యము
డ శిక్షించువారిలో నగుదు నేను ॥ ౨౯ ॥ అసురులందున బ్రహ్లాదు
డౌదు నేను। పార్థ! కాలుడ లెక్కించువారలందు; । మృగములను

మృగరాజను, ఖగములందు। నర్జునా! నేగరుత్మంతుడగుదుసుమ్ము॥ ౩౦ ॥ వాయువను శుద్ధిజేసెడు వారిలోన। దశరధసుతుండ నేశస్త్రి ధారులందు;। మత్స్యములలోననేను నామకరమౌను;। జాహ్నవి ని నేను నదులందు, సవ్యసాచి! ॥ ౩౧ ॥ ఆదియును నంతమును మధ్య మౌదు నేను। సృష్టులను, విద్యలందును తత్ప్రశస్తమైన। యధ్యాత్మవిద్య నేనౌదు పార్థ!। వాదమును జేయువారల, వాదమేను ॥౩౨॥ అక్షరముల నకారంబునగుదు నేను;। సలసమాసములన్ ద్వంద్వ, మక్షయంబు। నైనకాలంబు, ధాతయునైనయట్టి। విశ్వతోముఖుడను, నేనె వినుము పార్థ! ॥ ౩౩ ॥ సర్వహరమైన మృత్యువ, సంభవింప। బోవువారలయుత్పత్తి, పొలతులందు। శ్రీయువాక్కును కీర్తియు స్మృతియు ధృతియు। నోర్పు మేధయు, నేనైయుందు పార్థ! ॥౩౪॥ సామముల బృహత్సామంబు, ఛందములను। నేనుగాయత్రి, నగుదును, నెలలయందు। మార్గశీర్షంబు, ఋతువుల మధుఋతువను; ॥౩౫॥ పరులవంచించుజూదంబు పార్థ! నేను;। తేజమునుగలవారల తేజమేను;। జయము నుద్యోగమును నేను, సత్వగుణుల। సాత్వికము నేనెయై, యుందు సవ్యసాచి! ॥ ౩౬ ॥ యాదవులవాసుదేవుండ, నర్జునుండ। బాండవులయందు, మునులలో వ్యాసముని ని। కవిజనులలో నపార్థ! భార్గవుడ నేను ॥ ౩౭ ॥ దండనము జేయువారల దండమేను;। పార్థ! నేనౌదు నాజయోపాయనీతి। జయముగోరుచునట్టి రాజనులకెపుడు;। గోప్యములలోన మౌనంబు, కోవిదులగు। జ్ఞానవంతులదైనయాజ్ఞానమేను; ॥ ౩౮ ॥ సర్వభూతంబులకును బీజంబునైన। దేదియో యది నేనౌదు; నింతయేల। జంగమస్థావరాత్మక జగమునందు। భూతమేదేనిగలుగు నాభూతమెల్ల। లేదునన్నువినా, మరి, లేదు, పార్థ! ॥ ౩౯ ॥ అరినిషూదన! దివ్యంబులైన, నావి। భూతులకు,

నంతము లేదు పురుషవర్య! । యీవిభూతులవిస్తారమిటులనీకు । జె
ప్పబడియెను పార్థ! సంక్షేపముగను ॥ ४० ॥ కాంతియుక్తము నైశ్వర్య
వంతమగుచు । జాలనుత్సాహభరితమౌ సత్వమేది । గల్గునో, యది
యంతయు గల్గుచుండు। నాదు తేజోంశమున నర్జునా! ధ్రువంబు ॥
४१ ॥ బహువిధంబైన నీజ్ఞాన బహుళమునను। పార్థ! నీకేమి? నేనీ
ప్రపంచమెల్ల । నొకటయంశ చేవ్యాపించి యున్నవాఁడ ॥ ४२ ॥

ఇది విభూతియోగమను దశమాధ్యాయము.

---:0:---

ఏకాదశాధ్యాయము.

అర్జున—నన్నుఁగరుణింప నధ్యాత్మనామకంబు । నిరతిశయమును, గోప్య
మై బరగువాక్య। మేదిజెప్పితివో, దానఁజెడలెనాదు । మోహమం
తయు, శ్రీకృష్ణ! మురవిభేది ॥ ౧ ॥ వినఁగబడియెను, నాచే, సవిస్తర
ముగ । పద్మపత్రాక్ష! నీచేత, బ్రాణికోట్ల । పుట్టుకయు, నాశనంబు
ను, పుణ్యపురుష! । యవ్యయంబైన నీమహాత్మ్యమునుగూడ ॥ ౨ ॥
నీవుచెప్పితివెట్టులు నిన్నుఁగూర్చి । యట్టియీశ్వరరూపంబు, నభవ!
నేను । గోరుచున్నాను చూచుటకొఱకు దేవ! ॥ ౩ ॥ స్వామి! యా
రూపమేఁజూడ జాలియుంచు । ననుచు నీవెంచినను, నాకు నవ్యయం
బు । నైననీవిశ్వరూపము, నభవ! నీవు । చూపవయ్య, యోగేశ్వర!
చూడఁగలర ॥ ४ ॥

గ—పార్థ! నానావిధములు, నప్రాకృతములు। పలువిధములైన, వ
ర్ణాకృతులు గలిగిన। వందలును వేలునైన రూపములునావి। చూ

పెదను చూడుమీ, నీవు చూడని వెల్లర ॥ ౪ ॥ ద్వాదశాదిత్యులను, వ
స్వవసువుల, మరి। రుద్రులను, నశ్వినులను, మరుద్గణమును। భార
తా! యెన్నడును జూడబడని యట్టి। యద్భుతంబుల, జూడుమనంత
ములను ॥ ౬ ॥ జంగమస్థావరాత్మక సకలజగము। నవల జూడగఁగో
రు నన్యంబుతోడ। పార్థ! యీదేహమందొకప్రక్కనున్న। దానిగా
జూడుమీవు నిదానముగను ॥ ౭ ॥ పార్థ! యీనీదు నేత్రంబువలన, న
న్ను। శక్తుఁడవుగావుగన, దివ్యచక్షువిత్తు। గాంచుమీశ్వరయోగం
బు, గడగి నాది ॥ ౮ ॥

సంజ—ఓమహారాజ! యిటుమహాయోగులకును। ప్రభువు, హరిపలి
యవ్వలపార్థుని కొరకు। పరమమైనట్టి విశ్వరూపంబుజూపె ॥ ౯ ॥
పలుమొగంబులు నయనముల్, బహువిధంబు। లైన యాశ్చర్యము
లజూపునట్టిదియును। దివ్యభూషణకలితంబు, దివ్యములగు। నాయు
ధంబులు పైకెత్తి నట్టిదియును ॥౧౦॥ దివ్యమాల్యాంబరధరంబు, దివ్య
గంధ। ములవిలేపంబు గలదియు, పలువిధములు। నైన యాశ్చర్య
ములతోడ నమరినదియు। నంతటను మోములనుగల్గి, యంతమింత।
గానబడనట్టి, దైవంబు గనిరె నరుడు ॥ ౧౧ ॥ మింటనొక వేయిసూ
ర్యుల మేటికాంతి। యేకకాలంబునందున నెగసెనేని। తుల్యమగు
నదియామహాత్మునిప్రభలకు ॥ ౧౨ ॥ పలువిధంబుల భాగింపబడినయ
ట్టి। సర్వజగమును నప్పుడు సవ్యసాచి!। దేవదేవునియాదివ్యదేహాం
మందు। నొగివిలోకించె, నొకచోటనున్నయట్లు ॥ ౧౩ ॥ అంతనాశ్చ
ర్యమగ్నుడై యర్జునుండు। పులకలంతట మేనున బొటకరింప।
మాధవుని, శిరమునను నమస్కరించి। యంజలి ఘటించి, యాతడి
ట్లనుచుబలికె ॥ ౧౪ ॥

అర్జున—దేవ! చూచుచునుంటి నీదేహమందు। నెల్లదేవతలను, నటునీ

శుఁడైన । పద్మవాసుని బ్రహ్మను, బ్రహ్మఋషుల । నందరిని, పలువి
ధములునైనభూత । సంఘమును, దివ్యములునగు సర్పములను ॥౧౫॥
విశ్వమునకు విభుఁడవైన విశ్వరూప! । పలుభుజంబులు, నుదరముల్బ
లుమొగములు । నేత్రములు పెక్కులునుగల, నిన్ను నన్ని । చోట్లను,
ననంతరూపుని జూచుచుంటి । నాదిమధ్యాంతములుగాననైతి దేవ ॥
౧౬ ॥ గద కిరీటము చక్రంబు గల్గి, కాంతి । పుంజమై, యంతటను
దీప్తిబుగులుకొనఁగ । గననశక్యమై, జ్వలియించుఖరకరాగ్ని । కాంతు
లనుబోలు కాంతినిగల్గి, వెలుగు । నప్రమేయుఁడవగునిన్ను, నన్నియె
డల । జూచుచున్నాఁడ, నోదేవ! చూపుక్కలలర ॥ ౧౭ ॥ తెలియఁదగు
పరబ్రహ్మంబు దేవనీవె; । యఖిలజగతికి పరమాశ్రయంబునీవె;। య
వ్యయుండవై శాశ్వతంబైన ధర్మ । ములను కాపాడువాఁడవు; దల
తునిన్ను । నాసనాతనపురుషుండవనుచు, నేను ॥ ౧౮ ॥ ఆదిమధ్యాం
తరహిత, మనంతవీర్య । మపరిమితములు బాహువు, లర్కుఁడుశశి ।
నయనములు, మండుచున్నయనలమువంటి । మోముగల్గి, నీతేజంబు
మూలముగను । విశ్వమిదియెల్లను పరితపింపజేయు । చున్నవానిగ,
నిను జూచుచున్నవాఁడ ॥ ౧౯ ॥ ఒక్కఁడవగు నీచేతనె, యుర్వి మొద
లు । నంతరిక్షంబు తుదగలయంతరంబు । నన్నిదిక్కులతోడను, వ్యా
ప్తమాయె । భీతిచేమూఁడులోకములెదరుచున్న, వద్భుతంబును, ను
గ్రంబునైన నీదు । నాకృతిని దీనిజూచి, మహానుభావ! ॥ ౨౦॥ చొ
చ్చుచున్నారు నీయందు సురగణములు । భయముచే, నందుగొం
దరు ప్రాంజలులయి, । నినునుతింతురు, జయజయనినదములను । జే
యుచు, మహర్షిసంఘంబు సిద్ధగణము । పుష్కలస్తోత్రముల, నిన్ను
బొగడుచుండ్రు ॥ ౨౧ ॥ వసువులును, రుద్రు, లాదిత్యవర్గము, మరి ।
యక్షులును, సిద్ధ సాధ్యులు, నశ్వినులును । నలపితరులు, విశ్వేదేవ

తలు, మరుద్గ। ణమును, గంధర్వరాక్షసనాయకులును, । నిన్ను నా
శ్చర్యమగ్నులై నిక్కి నిక్కి । జూచుచున్నారు, వీరంత చోద్యముగ
ను ॥ ౨౨ ॥ పలుమొగంబులు, నయనము, ల్బాహువులును । నూరు
వులు, పాదములు, పలునుదరములును । భీతిబుట్టించు కోరలు, పె
క్కుగల్గి । యధికమైయొప్పునీరూపమంత జూచి । జడియు లోకము,
నేనును జడియుచుంటి ॥ ౨౩ ॥ వర్ణములనేకములు గల్గి, వన్నెకెక్కి।
దీప్తమైమింటనంటుచు, దెరవబడిన । యాననంబులు, కాంతిచే నల
రుచున్న । విపులనేత్రంబులును, గల్గివెలయునిన్ను । గాంచి, భీతా
త్ముడగునేను, గాంచనయితి । ధైర్యమును, మనస్సంతుష్టి దవులద
య్యె ॥ ౨౪ ॥ భీతిగొల్పెడు కోరలచేతనిండి । ప్రళయవహ్నినిబోలు
నీవదనములను । జూచినేదిక్కులను మఱిజూడజాల । కుంటి; సుఖము
ను బొందకయుంటి; గాన । సుప్రసన్నుడవగుము, విశుద్ధతేజ! ॥ ౨౫ ॥
ధరణిపాలసంఘంబుతో ధార్తరాష్ట్రు । లందరును వీరు, నటువలె
నధికబలులు । ద్రోణభీష్ములు, సూతసుతుడును, నాదు । యోధము
ఖ్యులతోగూడ నొక్కమారె ॥ ౨౬ ॥ కోరలనుగల్గి, భయమును గూ
ర్చుచున్న । నీదుమోములలో, జొచ్చినిల్చినార । లందు గొందరు దం
తపుసందులందు । జిక్కికొని, చూర్ణమానట్లు చేయబడిన । శిరముల
నుగల్గి, యున్నవారరయ దేవ! ॥ ౨౭ ॥ బహునదీప్రవాహంబులు ప
టురయమున । నభిముఖంబులై, యంబుధియందు జొచ్చు । విధము
గాను, నీనరలోకవీరులంత । యంతటను వెల్గుచున్న నీయాననముల।
యందు, జొచ్చుచునున్నవారతిరయమున ॥ ౨౮ ॥ ఎట్లు, నాశము
నొందంగ నెగసివచ్చి । పటురయంబున మిడుతలు, భగ్గుమనుచు ।
మండునగ్నినిబడు, నట్లె ప్రాణులెల్ల । నాశమునుబొంద నీముఖ నా
శములను । భూరిరయమున జొచ్చుచున్నారు, దేవ! ॥ ౨౯ ॥ మం

డుచున్నట్టిముఖముల, మనుజవర్గ। మంతయును, నన్నిదెసలను, న
లమిపట్టి। మ్రింగుచున్నావు, నాకుచు మేటితేజ। యుగ్రమౌనీదు
దీధితులు నిండి, సర్వ। జగమునిండి, తపింపగసాగె దేవ ॥ 30 ॥ దేవవ
ర! నీకుదండంబు, నీవు నాకు। సుప్రసన్నుడవగుమయ్య! నీప్రవృత్తి।
నెరుగ; నుగ్రరూపుడవగునీ వెవడవు;। దేవ! యాద్యుడవగునిన్నుదె
లియగోరు। చున్నవాడను, చెప్పవే యొప్పమీర ॥ 31 ॥

శ్రీభగ—సర్వలోకక్షయమునుజేయుశక్తినిగల। కాలమేనౌదు, మఱియు
నిక్కాలమునందు। నుద్యమించితి, లోకంబులుక్కడంప;। నుభయసే
నలయందుందు యోధులందు। నొక్కడునుదక్క లేడు నీవొక్కడుద
క్క ॥ 32 ॥ కావునను లెమ్ము; గెలువుము కౌరవులను;। పొందుము
యశంబు, రాజ్యంబు పుష్కలంబు। ననుభవింపుము; పార్థ! వీరంత
మంది। మున్నె నాచేత నిహతులై యున్నవారు। తలపనీవు నిమిత్త
మాత్రంబుచూవె ॥ 33 ॥ ద్రోణు, భీష్ముని, కర్ణు, సింధుపతినట్లె।
యితరులౌ యోధవీరుల, నింతమంది। పార్థ! నాచేత జంపగబడిన
వారి। వీరిగెలువుము; భయమునువీడు; మాజి। సలుపవే లెమ్ము; శ
త్రులగెలుతువీవు ॥ 34 ॥

సంజ—వెన్నుని సువాక్యమునుదీని, విని కిరీటి। చాలవణకుచు మ్రొక్కి,
యంజలిఘటించి। మాటిమాటికి బెదరుచు, మాధవునకు। మరలన
మ్రుడై, గద్గదస్వరముతోడ। బలికెనిట్లని, వినయంబు భయము గ
దుర ॥ 35 ॥

అర్జున—సంతసింపుచునున్నది జగమునిన్ను। కీర్తనముజేసి, హృ
షీకేశ! మరియు। బొందుచున్నది, యనురాగమును, భయమున।
దితిసుతులు పారుచున్నారు, దిశలకూర్చి;। సిద్ధసంఘంబులును నమ
స్కృతులుజేసె ॥ 36 ॥ ఉండు రెట్టులు మ్రొక్కక, యోమహాత్మ!।

కమలజాసకాదికర్తవు, ఘనుఁడవైన। నిఖిలగర్భ యనంత! జగన్ని వాస!। నీవె యక్షరుడవు, దేవదేవుడవును। నున్నదియు, లేనిదియు నీవె, యుభయమునకు। పరుఁడవునునీవె యాదిదేవుఁడవీవె, యనంతరూప। మరి పురాణపురుషుఁడవు, పర మనిలయ। మీజగంబుకు, నీచేత నీజగంబు। వ్యాప్తమాయెను, తెలి సినవాఁడవీవె;। తెలియఁదగు పరధామంబు దేవనీవె ॥ ౩౮ ॥ వాయు వును, నగ్ని, యముఁడును, వరుణుఁడును, శ। శాంకుఁడు, బ్రజాపతి యును, నతనితండ్రి। నీవె యాదమువు; దండంబునీకు దేవ!। మరియు పదివేలదండముల్, మరియు మరియు। దండములు దండములు నీకు తత్త్వమూర్తి ॥ ౩౯ ॥ ముందు, వెనుకను, బ్రక్కల, మూలలందు। జేరి, సాష్టాంగములునీకుజేతు, నమిత। వీర్యమును, మేరమీరినవిక్ర మంబు। గల్గి, యంతటవ్యాపించు కారణమున। సర్వరూపుఁడవైతివి సన్నుతాత్మ! ॥ ౪౦ ॥ దేవ! యానీమహిమను దెలియనట్టి। నే, గతుబ్రమాదవశమున, నెనరుకల్మి। యాదవా! కృష్ణ! చెలికాఁడ, యను ఘనేను। బలుకుచుంటిని, నెయ్యంపుబలముపలన ॥ ౪౧ ॥ అచ్యు తా! నేనునిను పరిహాసమునకు। విహరణశయనాసనముల, వేడుకల ర। తిండితినువేళ, నొంటిగాదిరుగునెడల। నలువురినడుమందున, పలువిధముల। నే, దిరస్కారమునుజేసి, యెరుగనైతి। నట్టినాయప రాధంబు నప్రమేయ!। సైచి, రక్షింపవే! నన్ను సన్నుతాత్మ ॥ ౪౨ ॥ జంగమస్థావరాత్మక జగమునకును। జనకుఁడవు, పూజ్యుఁడవు, చాల ఘనగురుఁడవు। గాన, లోకత్రయముల సమానుఁడెవఁడు। లేఁడు, య ధికుండుగల్గునే యీఁడులేని। సుప్రభావంబుగలవాఁడ, వప్రమేయ! ॥ ౪౩ ॥ అందువలనను కాయంబు నవనిఁజేర్చి। మ్రొక్కి యీశుఁడవును, మరిపూజ్యుఁడవును। నైన, నీసుప్రసాదమునందువాఁడ;। సుతుని య

పరాధమును తండ్రి, హితునితప్పు। హితుడు, నాప్రియురాలిమరిత
ము దాని। ప్రియుడుసైచినరీతిని, ప్రేమమీర। స్వామి! నాయపరా
ధంబు సైపుమయ్య ॥ ౪౪ ॥ ఎవ్వరునుమున్నుజూడని యీస్వరూప।
మును విలోకించి, యోదేవ! ముదితుడైతి;। నామానసము భీతిచే చల
నంబు నొందె;। చూపవేనాకు నీపూర్వరూపమిపుడు। కరుణనోదేవ
దేవ! జగన్నివాస! ॥ ౪౫ ॥ వేయిభుజములుగలిగిన విశ్వమూర్తి!। శిర
మునను కిరీటము, మరిచేతులందు। గదయు చక్రంబుగల, నిన్ను క
నులజూడ। గోరెద, చతుర్భుజంబులకొమరుమిగులు। పూర్వరూపం
బు దాల్పవే, పురుషవర్య! ॥ ౪౬ ॥

శ్రీభగ—సుప్రసన్నత నాచేత జూపబడియె। నర్జునా! విశ్వరూపంబు,
నాత్మయోగ। బలమునను, పూర్వమెప్పుడు, పరులచేత। నిదియు
చూడంగబడనిది, మొదటిరూపు। మిగులనుత్కృష్టమైనది, మేరలేని।
దియును, తేజోమయంబైన, దివ్యతనువు ॥ ౪౭ ॥ వేదయజ్ఞాధ్యయన
ముల, తపము మరియు। దానముల, కర్మముల, నుగ్రతపమువలన।
నోకురుశ్రేష్ఠ! యీనరలోకమందు। నీస్వరూపుడనగునన్ను, నితరు
లెవరు। నీవొకడుదక్క; జూడంగనేరరుగద ॥ ౪౮ ॥ జడమతివిగాక
యుండుము; జడియవద్దు। యిట్టిఘోరమగు నారూపమీవుజూచి। భీ
తివిడనాడి, మనమున ప్రీతిగల్గి। తిరిగినాదగు వెనుకటిదేహమీవు। వే
గజూడుము, కురువర్య! వేడుకలర ॥ ౪౯ ॥

సంజ—అర్జునునిగూర్చి కృష్ణుడిట్లనుచుబల్కి। తిరిగితనపూర్వరూపం
బు తెరగుజూపె। నామహాత్ముడు సౌమ్యదేహంబుదాల్చి। యులుకు
చున్నట్టి, యర్జునునూరడించె ॥ ౫౦ ॥

అర్జున—స్వామి! యిప్పుడు నీదగు సౌమ్యమైన। మానుషాకారమును
జూచి, మరలనేను। స్వస్థతనుబొంది, చైతన్యసంయుతుండ। నైతి,
పూర్వస్వభావంబు నబ్బెమరల ॥ ౫౧ ॥

శ్రీభగ—చూడనశర్లభ, మిపుడీవు చూచినట్టి। యాస్వరూపంబు నాయ
ది, యహారహంబు। జూడగోరుమరజ్ఞాని, సురలుగూడ ॥ ఎటులజూ
చితివో నన్ను, నటులనన్ను। జూడశక్యంబుగాదల్ల శ్రుతులచేత।
తపములను, యజ్ఞముల, మరిదానములను ॥ ౫౩ ॥ ఓపరంతప! యీ
విశ్వరూపినైన। నన్ను నిజముగ దెలియగ, నన్నుజూడ। నన్నుబొం
దంగ, శక్యమౌ నన్నెనమ్మి। యున్న, నిశ్చలభక్తిచే, నన్నుతాత్మ ॥
౫౪ ॥ నాకొరకు కర్మజేయుచు, నన్నెగతిగ। ననయమునునమ్మి, నా
భక్తుడైనవాడు। సంగవర్జితుడై, భూతసంఘమందు। వైరమింతయు లే
కుండ బరగువాడు। పాండవా! బొందుచున్నాడు, వాడు నన్నె ॥౫౫॥

ఇది విశ్వరూపసందర్శనయోగమను యేకాదశాధ్యాయము.

———:0:———

## ద్వాదశాధ్యాయము.

———

అర్జున—ఇటుసమాహితచిత్తులై యెపుడు నిన్ను। ధ్యానమును చేయుభ
క్తులో? యుత్తరంబు। నైన యవ్యక్తమును గొల్చినట్టివారో?। యు
భయులందెవ్వరెక్కుడు యోగవిదులు ॥ ౧ ॥
శ్రీభగ—భక్తులెవ్వరు నాయందు బరపి మనము। నతిసమాహితచిత్తు
లై, యనవరతము। పరమమౌ శ్రద్ధతో నాయుపాసనమును। జేతురో
వారు యోగము శ్రేష్ఠతరము। గా నెరుగువారలని యెంతు నేను
పార్థ! ॥ ౨ ॥ ఎవ్వరెన్నడు చెడనిది, యిట్టిదనుచు। దెలుపశక్యంబు
గానిది, కేటపడని। యట్టిదియు, నంతటను నిండినట్టిదియును। తలప
శక్యంబుగానిది, దాగిలివలె। బ్రకృతియందున సాక్షియై బరగున

దియు। చలనమొందక ధ్రువముగ నిలచునదియు। నైనదానిని, ధ్యా
నిఁతురట్టివారు ॥ ౩ ॥ ఇంద్రియగ్రామమును నిగ్రహించి, సర్వ। కా
లములయందు, సమబుద్ధికలిగి, సర్వ। భూతహితమున, నాసక్తిబొం
దుచున్న। వారుగూడను, బొందుచున్నారునన్నె ॥ ౪ ॥ అధికకష్టము
నవ్యక్తమందు నక్త। మైనచిత్తముగలవారి; కదియునేల। యనిన దే
హాభిమానమునందు వారి। కధికకష్టంబు నవ్యక్తమందుజేర ॥ ౫ ॥
సర్వకర్మలు నాయందు సన్న్యసించి। నన్నె యుత్తమగతిగను నమ్మి
యుతర। చింతలనుమాని, యోగంబుచేత నెవరు। ధ్యానమునుసల్పి
కొల్తురో, దవిలినన్ను ॥ ౬ ॥ పార్థ! నాయందు చిత్తంబు బరపిన
ట్టి। వారలకునేను మృత్యురూపంబునైన। భవమహాంబుధినుండి,
సత్వరను, నుద్ధ। రించువాడనునాదు, నేనెంచిచూడ ॥ ౭ ॥ నిల్పు
మునునంబు నాపీద; నీదుబుద్ధి। నుంచుమీ నీవునాయందు; నుండగ
లవు। ముందునాలోన, సంశయమిందులేదు ॥ ౮ ॥ నీవు నాయందు
చిత్తంబు నిశ్చలముగ। నిల్పనేరకపోయిన, నీవు నపుడు। దవిలి య
భ్యాసయోగముదాల్చి, నన్ను। బొందుటకు నిచ్చయింపుము, పురు
షవర్య! ॥ ౯ ॥ నీవు నభ్యాసమును జేయనేరకున్న। నగుము మత్క
ర్మపరుడవు, నటులనీవు। నాకొరకు కర్మములజేసి నాడెముగను। సి
ద్ధిబొందెదవర్జునా! సిద్ధమిదియు ॥ ౧౦ ॥ అదియు జేయగశక్తినీకబ్బ
దేని। యర్జునా! నీవు నాయోగమాశ్రయించి। నియతచిత్తుండవ
గుచును, నిఖిలకర్మ ॥ ఫలమువిడువుము సర్వత్ర, పార్థ! నీవు ॥౧౧॥
జ్ఞానమభ్యాసమునకు, శ్రేష్ఠంబునుమ్ము। జ్ఞానయోగముకంటె, ధ్యా
నంబులెస్స। ధ్యానమునకంటె, ఫలపరిత్యాగమధిక। మగును, శాం
తియునధికమాత్యాగమునకు ॥ ౧౨ ॥ ప్రాణికోట్లకునెల్ల నిర్వైరి,
మైత్రి। నెరపువాడును, కరుణచేబరగువాడు। మమతయును నహం

కారము మానువాఁడు। సుఖదుఃఖంబునొకరీతి జూచునట్టి। బుద్ధి
గలవాఁడు, యోర్పును బొందువాఁడు ॥ ౧౩ ॥ నిరతసంతుష్టుఁడును,
దృఢనిశ్చయుండు। ధ్యానపరుఁడును, నియమితమైనచిత్త। వృత్తిగల
వాఁడు, నాకు నర్పింపబడిన। చిత్తమును బుద్ధిగల భక్తశేఖరుండు।
నెవ్వఁడో, వాఁడు నాకెప్పుడిష్టుఁడగును ॥ ౧౪ ॥ భయపడదు లోకమె
వ్వనివలన, నెవఁడు। జడియఁడో లోకమునుజూచి, సంతసంబు। నస
హనంబును భయమును నార్తియును। నెవఁడు విడుచునో, వాఁడె
నాకిష్టుఁడగును ॥ ౧౫ ॥ ఏయపేక్షయు లేనివాఁ, డెపుడు శుచియు। ద
క్షుఁడును, మరిపక్షపాతంబు లేని। వాఁడు, నారంభములనెల్ల వదలు
వాఁడు। భీతిలేనట్టిభక్తుఁడు, ప్రియుఁడు నాకు ॥ ౧౬ ॥ అలరఁడెప్పుడు,
ద్వేషింపఁడార్తిఁబొందఁ। డాశబొందఁడు, విడుచు శుభాశుభముల।
నెవఁడు భక్తుఁడో, వాఁడు నాకిష్టుఁడగును ॥ ౧౭ ॥ శత్రులందును నటువలె
మిత్రులందు। మానమందును, నటులవమానమందు। చలికి వేడికి,
సుఖదుఃఖములకు నటుల। నెవఁడు సముఁడగు, సంగరహితుఁడెవండు ॥
౧౮ ॥ మరియు నిందాస్తుతులను సమానుఁడెవఁడు। దాల్చునెవ్వఁడు మౌ
నవ్రతంబు, నెంత। కొంచమునైన సంతుష్టిఁగొను నెవండు। యొ
క్క యెడనిల్లు లేకుండనుండు నెవఁడు। నిశ్చయంబైనబుద్ధిచే నెగడు నె
వఁడు। నాకు భక్తుఁడు నెవ్వఁడానరుఁడు ప్రియుఁడు ॥ ౧౯ ॥ నన్నె యు
త్కృష్టగతిగా గనమ్మి యెవరు। నమృతధర్మంబు దీనినత్యంతశ్రద్ధ। దా
ల్చి నే చెప్పినట్టి। విధంబుగాను। తాముపాసనచేతురో తవిలి వారు।
భక్తులును పరమాప్తులు పార్థ! నాకు ॥ ౨౦ ॥

ఇది భక్తియోగమను ద్వాదశాధ్యాయము

---

## త్రయోదశాధ్యాయము.

అర్జున—ప్రకృతిపురుషులజెప్పుము; పరమపురుష! । క్షేత్రమును, మరి
క్షేత్రజ్ఞు, జెప్పుమయ్యా! । జ్ఞానమును, మరిజ్ఞేయంబు, నానతిమ్ము ॥౧॥
శ్రీభగ—క్షేత్రమని యీశరీరము చెప్పబడును; । దానినెరిగెడివాడు
క్షేత్రజ్ఞుడనుచు । దీని నెరిగినవారు కౌంతేయ! యనిరి ॥ ౨ ॥ తలపు
మర్జున! నన్ను క్షేత్రజ్ఞునిగను । క్షేత్రములనన్నిటను మరిక్షేత్రమిది
యు । నితడుక్షేత్రజ్ఞుడనెడు నేయెరుకగలదో । నామతంబుననదియె
జ్ఞానంబుపార్థ! ॥ ౨ ॥ ఏదో, యెట్టిదో, యీక్షేత్రమేవికార । ము
నుగలదియొ, నేకారణముననుకార్య । మేదిపుట్టునో, క్షేత్రజ్ఞుడెవడో
మరియు । నేప్రభావముగలవాడో, నివియనంత । జెప్పెదనుపార్థ!
నీకుసంక్షేపముగను ॥ 3 ॥ పలువిధంబుల ఋషులచే బలుకబడియె । తత్స్వ
రూపంబు, మరియు వేదములచేత । బరగ ప్రత్యేకముగ జెప్పబడియె
నదియె; । సంశయరహితంబుగను, నిశ్చయముజేయ । బడిన యుక్తి
యుక్తములగు, బ్రహ్మసూత్ర । వాక్యములచేత, లెస్సగాబలుకబడియె॥
౪ ॥ భూతములు, నహంకారము, బుద్ధి, మాయ । జ్ఞానకర్మేంద్రియ
ములు, మనంబు, నొకటి । విషయములునైదు, తత్వముల్ వినుము
పార్థ! ॥ ౫ ॥ అర్జునా! యిచ్ఛ, ద్వేషంబు, నార్తి, సుఖము । కా
యమును నింద్రియంబులు కలసియుంట । యలమనోవృత్తి, ధైర్య
మివన్నియును, వి । కారములతోడకూడి, సంగ్రహముగాను । క్షేత్రమ
నియెడుపేరుచే జెప్పబడియె ॥ ౬ ॥ పొగడుకొనకుంట తన్నుదాబూని,
తనము । ధర్మమును వెలిబుచ్చెడు దంభముడిగి । యుంట, హింసలే
కుంకుట, యొరులనుతను । మించుటయు, కౌటిల్యంబుద్రెంచుటయును

నాత్మగురుసేవ, శౌచంబు, నధికమైన । నిశ్చలత్వంబు, మరి మనోని
గ్రహంబు ॥ ౭ ॥ విషయములయందు కోరిక విడుచుటయును । మరియ
హంకారమెప్పుడు మరచియుంట । జన్మమరణ జరారోగజంబులైన ।
భూరిదుఃఖంబులను తలపోయుచుంట ॥ ౮ ॥ అనయమును బుత్రదార
గృహములందు । బ్రేమ, తాదాత్మ్యభావంబు విడుచుటయును । యిష్ట
లాభంబునందు ననిష్టపీడ । గల్గుతరి, సమబుద్ధిని, గలిగియుంట; ॥ ౯ ॥
అచలనాయందు నెప్పుడనన్యమైన । చలనమును లేని భక్తియు, జనులు
లేని । స్థలములందుండుటయు, జనసంఘమందు । జేరుటకునను రాగం
బు జెందకుంట ॥ ౧౦ ॥ నిత్యమధ్యాత్మవిజ్ఞాననియతిగనుట । తత్త్వవి
జ్ఞానఫలముగు దానియందు । దృష్టినుంచుట, యనునివి తెలుపబడెను।
జ్ఞానమును పేర, మరియు నజ్ఞానమనుచు । బల్కుదురు దీనికి తరవా
వానినెల్ల ॥ ౧౧ ॥ జ్ఞేయమేదియొ దానిని జెప్పెదనిక । నేదితెలిసిన
మరణరాహిత్యమొందు । నాది లేనిది, యుత్కృష్టమైనబ్రహ్మ । మది
యొ సదసత్తులుగానిదగుచుబరగు ॥ ౧౨ ॥ అంతటను పాణిపాదము,
లన్నియెడల । నేత్రములు, తలల్ ముఖములు శ్రోత్రములును । గల్గి,
యాపరబ్రహ్మముగలదు, లోక । మందు, పూర్తిగ వ్యాపించి, యన్ని
యెడల ॥ ౧౩ ॥ పార్థ! సర్వేంద్రియంబుల పనులచేత । వెల్గుచున్న
ట్లుదోచిన, వివిధములగు । నింద్రియంబులు లేనిది, యెందుదాను ।
నంటకున్నను ధరియించునన్ని, యగుణ । మైన దానన్నిగుణముల న
నుభవించు ॥ ౧౪ ॥ ప్రాణులకు లోపలను వెలుపలనుగలదు । ఈచ
రాచరరూపమై యొసగునదియె । తలప నతిసూక్ష్మమాటను దెలియ
బడదు । మిగులదవ్వగు, నుండు సమీపమందు ॥ ౧౫ ॥ బ్రహ్మ మవిభ
క్తమయ్యును, ప్రాణులందు । నెల్లను విభక్తమగదోచు, నెల్లభూత।
ములను భరియించుచుండును, విలయమందు । వానినిగ్రహించు, బు

ట్టించు, వానినురల ॥ ౧౬ ॥ తేజములనెల్ల వెలిగించు తేజమదియు। మరియు వ్యతిరిక్తమదియు తమంబుకంటె। జ్ఞానమును మరిజ్ఞేయం బు, జ్ఞానగోచ। రంబునైనది, యీసర్వప్రాణులహృద। యములను న్నది, యరిచెప్పనగును నదియు ॥ ౧౭ ॥ క్షేత్రమును, మరిజ్ఞానము, జ్ఞేయమిట్లు। దెలుపబడియె సంగ్రహముగ, దివిరినాచె। భక్తుడిద్దాని దెలిసి, నాభావమునకు। వాడు నర్హుడునగుచున్నాడు, పార్థ!॥ ౧౮ ॥ ప్రకృతి పురుషుడు, నీరెండు పార్థ! తెలియు। మాదిలేకవి గాను, బుద్ధ్యాదివికృతి। రూపములు గుణములును, నెరుగుము, నీవు। బ్రకృతివలనను బుట్టినవానిగాగ ॥ ౧౯ ॥ కార్యమగు దేహమును, మరి కరణములను। నిద్రియంబుల, బుట్టింప హేతువగును। ప్రకృతి, సుఖ దుఃఖములననుభవమునొంద। బురుషుడే కారణంబనియెరుగుమీవు ॥ ౨౦ ॥ ప్రకృతియందున్నవాడగు, బ్రకృతివలన। బుట్టినట్టి గుణంబు ల, బురుషుడనుభ। వించు, గుణసంఘము సంభవించుచుండు। బు ణ్యపాపయోనులదాను బుట్టుటయును ॥ ౨౧॥ అరయువాడును, సా క్షియై యనుమతించు। నట్టివాడును, భరియించునట్టివాడు। యను భవించెడువాడు, నిరహంకృతుండు। నగుచు, బరమాత్మయనబడునట్టి పురుషు। డీశరీరమునందు నుత్కృష్టుడగును ॥ ౨౨ ॥ ఎవ్వడీప్రకా రంబుగ నెపుడు బురుషు। గుణసహితమైన ప్రకృతిని, గణనచేసి। యెరుగునో, వానివర్తనమెట్టులున్న। నైనబుట్టడు తిరిగి, వాడవని యందు ॥ ౨౩ ॥ చూచుచున్నారు కొందరు, శుద్ధబుద్ధి। యందునిర్మ లమునముచే నాత్మనెపుడు। ధ్యానయోగముచే, నికనన్యులల్ల। సాంఖ్యమున, గొందరల్ల నిష్కామకర్మ। యోగమున, నాత్మజూచు చునున్నవారు ॥ ౨౪ ॥ ఈప్రకారము మరికొందరెరుగలేక। పరుల చేవిని, యాత్మనుపాసనంబు। జేయుచున్నారు, శ్రవణంబుజేయునట్టి।

వారును, నతిక్రమించుచున్నారు మృత్యువుని ॥ ౨౫ ॥ జంగమస్థావరాత్మ
కసకలజగము। నందుబుట్టెడు సత్త్వమెంతైనగాని। తెలియుమా వ
స్తువెల్లను కలిగినదని। ప్రకృతిపురుషసంసర్గమువలన పార్థ! ॥ ౨౬ ॥
ఎవడు భూతంబులందెల్ల నేకరీతి। నున్న, పరమేశ్వరుని ప్రాణులన్ని
యును, న। శింపుచుండగ, నెపుడు నశింపడనుచు। చూచుచున్నా
డో, వాడె పో చూచువాడు ॥ ౨౭ ॥ సర్వప్రాణులయందున సమము
గాను। నున్న, యీశ్వరుజూచుచునున్నవాడు। నెట్టులాత్మచే నా
త్మను హింసజేయు। వాడునుంగాడో, యందుచే వాడుపరమ। గ
తిని పొందుచునున్నాడు, కలుషరహిత! ॥ ౨౮ ॥ బహువిధంబుల గర్మ
ముల్ప్రకృతివలన। మాత్రమే జేయబడుచుండు, మరియునాత్మ। కర్త
యెప్పుడుగాడని, గడగియెవడు। జూచుచున్నాడో, వాడె పో చూచు
వాడు ॥ ౨౯ ॥ భూతముల భిన్నభావము, బుద్ధినెప్పు। డొకట-టో
యాత్మయందునన్నయట్లు। చూచుచున్నాడో, యెప్పుడు జూచు
చుండు। వానివిస్తారమాయాత్మవలననుచు। నపుడు నాతడు బ్ర
హ్మంబెయగును పార్థ! ॥ ౩౦ ॥ ఆదిలేనందువలనను, నగుణుడౌట।
నవ్యయుండైన యాపరమాత్మ, దేహ। మందునున్నను, కౌంతేయ!
యతడు చేయ। డేమియును, నంటదాతని నేఫలంబు ॥ ౩౧ ॥ ఎట్టులా
కాశభూతంబు నెల్లయెడల। వ్యాప్తమయ్యును, గడుసూక్ష్మమగుటచే
త। నంటకుండునో, నావిధి నాత్మదేహ। మందు సర్వత్రయుండియు
నంటడెపుడు ॥ ౩౨ ॥ భారతా! యెట్టులొకడయ్యు భానుడీజ। గంబు
సర్వము వెలిగించి, కాంతులిమ్ము। నటులె, సర్వశరీరమీయాత్మయెపు
డు। దాను వెలిగించుచున్నాడు తనవెలుగున ॥ ౩౩ ॥ ఈప్రకారముగా
జ్ఞానదృష్టిచేత। ప్రకృతిపురుషులభేద, మవ్యక్తమైన। ప్రకృతియొక్క-

యు, మరిదానివలనబుట్టు। భూతముల యభావగమనంబును నెవం
డు। నెరుగు, నాడె పరబ్రహ్మమెపుడుపొందు ॥ ౩౪ ॥

ఇది క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమను త్రయోదశాధ్యాయము..

———:0:———

## చతుర్దశాధ్యాయము.

శ్రీభగ—జ్ఞానములలోన మిక్కిలి నాడెమైన। యేపరజ్ఞానమును, బొం
ది యెల్లమునులు। కాయమనుబాసి, యుత్కృష్టగతిని గనిరొ। మర
లదానిని జెప్పెద, నెరుగుమీవు ॥ ౧ ॥ పొందియీ జ్ఞానసాధనమును
బురుషులు। నాదగుస్వరూపముబొంది, మీదనుగల। జన్మమునుబొం
దరు, రాసృష్టిసమయమందు। ప్రళయమందును బొందరు వ్యథను వా
రు ॥ ౨ ॥ భారతా! నాదియగు గొప్పప్రకృతియోని। యందునే గ
ర్భమును నుంచుచుందు, దాని। వలన భూతంబులెల్లను ప్రభవమొం
దు ॥ ౩ ॥ ఓయుకొంతేయ! విను సర్వయోనులందు। మూర్తులేపిజనిం
చు, నామూర్తులకును। నధికమగుప్రకృతియెతల్లి యగును, మరియు।
బీజమును నిచ్చునట్టి యా పితను నేనె ॥ ౪ ॥ ప్రకృతివలననుబుట్టు స
త్త్వము, రజంబు। తమమునను గుణములుమూడు, తనువునందు। న
న్యయుండగుదేహి నత్యధికముగను। పార్థ! యరిగట్టుచున్నవి, భ్రాం
తుజేసి ॥ ౫ ॥ ఆగుణంబులస్వచ్ఛంబునగుటవలన। మరిప్రకాశకమాట
ను, కరమువద్ర। వరహితంబౌట, సత్త్వంబు దురితదూర!। చాలసుఖ
సంగమున, జ్ఞానసంగమునను। కట్టుచున్నది, దేహిని, గలుషరహిత!
౬ ॥ రానివస్తువుగోరుట, ప్రాప్తమైన। విషయముల ప్రీతిబొందుట,

వీనివలన । గల్గినరజోగుణంబు రాగాత్మకంబు । గాను తెలియుము,
కర్మసంగముననిదియు । కట్టుచున్నది, దేహిని, కలుషరహిత! ॥ ౭ ॥ దే
హధారులకెల్లను మోహకరము । నైన, తమముబుట్టినది యజ్ఞాన
మునను । నను చు దెలియుము, భారతా! యదియుగట్టు । నిరతమను
ప్రమాదాలస్యనిద్రల నెడు । వానిచేతను, దేహిని, భ్రాంతుజేసి । ౮ ॥
పార్థ! సుఖమందునూర్చు సత్వంబు, మరిర । జోగుణము కర్మమం
దుగూర్చును; తమంబు । జ్ఞానమును నావరించి, నిశ్చయముగాను ।
మరచియుండుటయందున బరగగూర్చు ॥ ౯ ॥ రజమును తమోగుణ
మును దిరస్కరించి । సత్వమును గల్గుచున్నది, సత్వతమసు । లనుది
రస్కరించి రజంబు, కనుబ్రకటన । సత్వరజసులదగు తిరస్కారమున
ను । భారతా! తమోగుణమును బరగుచుండు ॥ ౧౦ ॥ ఎప్పుడీదేహ
మునను, సర్వేంద్రియములు । శ్రోవలంమున, జ్ఞానస్వరూపమైన । తె
లివిపుట్టుచునున్నదో, తెలియుగప్పు । డనఘ! సత్వంబు వృద్ధిబొంది
నదియనుచు ॥ ౧౧ ॥ ఒకులసాత్తును గోరుబయుము, ప్రవృత్తి । కర్మ
ములనొకలిపుటయు, కలతపడుట । యిచ్ఛయును, బుట్టుచుండగ,
నెరుసుమీవు । మించెను, రజోగుణంబని, మేటివీర! ॥ ౧౨ ॥ అర్జు
నా! తెల్వి లేకుంట, యప్రవృత్తి । సావధానము లేకుండ బోవుట
యును । మోహమనుసివిగల్లు, తమోగుణంబు । వృద్ధిబొందుచునుం
డగ, నిర్దచరిత! ॥ ౧౩ ॥ సత్వమును వృద్ధిబొందుచు సాగుచుండ ।
నెపుడు మరణంబునొందునో యీశరీరి । యపుడుబొందెడు, స్వ
చ్ఛంబులైన బ్రహ్మ । వేత్తలందెడిలోకము ల్వినుతశూర! ॥ ౧౪ ॥
అలరజోగుణమును వృద్ధినందుచుండ । మరణమొందిన యాతడు,
మనుజులందు । బుట్టుచున్నాడు, మరియు తమోగుణంబు । వృద్ధి
బొందుచునుండగ విలయమొందు । వాడు, మూఢయోనులయందు

ప్రభవమొందు ॥ ౧౫ ॥ పలుకుదురు సుకర్మమునకు ఫలముసాత్త్వి
కంబునిర్మలమైనదిగాను మరియు। నలరజోగుణకర్మంబు ఫలముదుః
ఖ। ముగ, దమఃకర్మమునకును, ముఖ్యఫలము। నోయి కౌంతేయ!
యజ్ఞానమేయటందు ॥ ౧౬ ॥ సత్త్వమున బుట్టుచున్నది జ్ఞానమరయ।
ప్రబలును రజోగుణమున, లోభంబె; మరియు। మోహమును ప్రమా
దంబు తమోగుణంబు। వలన నజ్ఞానయుతముగ గలుగుచుండు॥౧౭॥
ఊర్ధ్వలోకంబులకు బోవుచున్నవారు। సాత్త్వికులు, రజోగుణవృత్తి
సహితులెపుడు। మధ్యమస్థ్మాతలంబున మనికిగాంత్రు। పోవుచుందు
రధోగతి పొంది తామ। సులును, పశ్వాదియోనుల గలుగుచుండి ॥
౧౮ ॥ ఎప్పుడు వివేకి, గుణములకితరమైన। కర్తనొకని జూడడో,
కర్మసాక్షి। యీ గుణాతీతునెరుగునో, యపుడువాడు। నాస్వరూ
పంబు బొందుచున్నాడు పార్థ! ॥ ౧౯ ॥ దేహములు బుట్టినట్టి యీ
త్రిగుణములను। దేహియెప్పుడు తానునతిక్రమించు। జన్మమృత్యుజ
రాదుఃఖసముదయముల। వలన, నప్పుడె విడువంగబడుచువాడు।
పొందుచున్నాడు, నమృతత్త్వమును కిరీటి! ॥ ౨౦ ॥

అర్జున—త్రిగుణములనిట్లుదాటిన దేహి దేవ!। యెట్టిచిహ్నముల్ గల్గు
వాడీశ! మరియు। నెట్టియాచారవంతుడో? నెట్లుదాటు। చున్న
వాడీగుణంబులి? సుభగచరిత! ॥ ౨౧ ॥

శ్రీభగ—పాండవా! వాడు తనకు సంప్రాప్తమైన। సత్త్వగుణకార్యము
ను ప్రకాశంబునైన। యలరజోగుణకార్యంబునగు ప్రవృత్తి। నైన,
తామసంబైన మోహంబునైన। తాను ద్వేషింపడెప్పుడు, తలగియు
న్న। యట్టి కార్యములనుగూర్చి యాసపడడు ॥ ౨౨ ॥ పక్షపాతము
లేనట్టి వానివలెను। నున్నయెవడు గుణములచే, నూపబడడొ।
యుండు గుణములే వర్తించుచున్నవనుచు। దలచి, యెవ్వడు పొందడో

చలనమెందు ॥ ౨౩ ॥ ఎవడు సుఖదుఃఖములయందు నెప్పుడు సము
డో। మఱియునాత్మావలోకన పరుడెవండో। సమముగా జూచు, రా
యి, కాంచనము, మంటి। గడ్డయును, ప్రియాప్రియములగడు సముం
డు। స్థైర్యవంతుడు, సముడు నిందాస్తుతులను ॥ ౨౪ ॥ మానమందు
ను మఱియవమానమందు। సముడు, సముడు మిత్రారిపక్షములయం
దు నన్నియారంభముల వీడునట్టివాడు। నట్టివాడు గుణాతీతుడనగ
బరగు ॥ ౨౫ ॥ కడుతిరంబైన భక్తియోగమున, నన్ను। నెవడు సే
వించుచున్నాడో, యీగుణముల। వాడు దాటుచు, బ్రహ్మభావంబు
కొరకు। నతడుమిగుల సమర్థుడేయగునుపార్థ! ॥ ౨౬ ॥ అట్టులే
లన, నేనె బ్రహ్మంబునకును। స్థానభూతుడ, నవ్యయస్థానమైన। య
మృతపదమున కాశ్రయమగుదు, నిత్య। మైనధర్మంబునకు నాశ్ర
యంబు నేను। నగుదు, నేకాంతసుఖమున కాశ్రయుండ ॥ ౨౭ ॥

ఇది గుణత్రయవిభాగయోగమను చతుర్దశాధ్యాయము.

———::o::———

## పంచదశాధ్యాయము.

శ్రీభగ—ఎగువ బ్రహ్మంబె మూలంబు, దిగువనల్ల। మహదహంకార
ములును కొమ్మలుగగల్గి। నట్టి, సంసారవృక్షంబు, నవ్యయంబు। నై
న యశ్వత్థమనబడు; నట్టిదాని। యాకులగును, వేదంబులు; నట్టిదైన
వృక్షమెరిగినవాడెపో వేదవిదుడు ॥ ౧ ॥ దానికొమ్మలు స్థూలీకృతం
బులగుచు। త్రిగుణములచేత, శబ్దమాదిగనునున్న। విషయములునను
పల్లవవితతిగల్గి। మిగులవ్యాపించె, దిగువున మీదగూడ। దానికూక

టి వేరులు మనుజలోక। మందు కర్మంబు వెన్నంటి యరిగిపోచ్చు।
చుండు, క్రిందికి నవ్విధినూర్ధ్వమునకు ॥ ౨ ॥ ఇచ్చటనుదీని యాకా
రమెఱుగబడదు। ఆదిమధ్యాంతములుగూడ నట్లె తెలియ। బడవు,
దృఢమూలయుతమున శ్వత్థమిదియు। దృఢవిరక్తియస్త్రాన దీనిద్రుం
చి ॥ ౩ ॥ అవలనేపదమును బొందినట్టివారు। తిరిగి మళ్ళరో, మరిప్ర
వర్తింపబడునో। యెవనిచేత ననాదియా నీప్రవృత్తి। మూలకారణ
మైన యాపురుషుశరణు। బొందుచుంటినటంచు, ముముక్షు వెపుడు।
తగును వెదకంగ, మోక్షపదంబు తాను ॥ ౪ ॥ మానమును మరి మో
హంబు లేనివారు। సంగదోషంబులను గెల్చి జరుగువారు। నిరతము
ను నాత్మయందున నిల్చువారు। తొలగియుండిన యిచ్ఛలుగలుగువా
రు। మరియు సుఖదుఃఖసంజ్ఞలవరలునట్టి। ద్వంద్వములబాయుజ్ఞాను
లవ్యయమునైన। పదము, దానిని బొందెడువారుచూవె ॥ ౫ ॥ ఆ
పదము వెలిగింపలేరర్కుఁడు శశి। పావకుండును, నేభవ్యపదముబొంది।
తిరిగి మళ్లరో, యదియనాదివ్యపదము ॥ ౬ ॥ ఆదిలేనట్టినాయొక్క
యంశమేను। జీవలోకంబునందున, జీవభూత। మై ప్రకృతియందు
నుండి యారవదియైన। మనముతో, నింద్రియంబులగనవశముగ। జే
రలాగుచునున్నది, జీవుడగుచు ॥ ౭ ॥ పశరీరముపొందునో యీశ్వ
రుండు। నేశరీరమువిడుచునో, యీమెడలను। స్థానములనుండి వా
యువుసౌరభంబు। దీయువిధమున, దానునింద్రియములను, గ్ర।
హించుకొనిపోవుచున్నవాడీశ్వరుండు। కనులు, చెవులును, స్పర్శం
బు, ఘ్రాణ, రసన। మనెడు నైదింద్రియములను, మనమునందు।
తానధిష్ఠించి, యితడుశబ్దాదివిషయ। ములననుభవించుచున్నాడు,
వలను మెరయ ॥ ౮ ॥ తనువువిడిచెడు వానిగ, తనువునందు। నున్న
వానిగ, ననుభవమొందుచున్న। వానిగను, గుణసహితుడౌ వానిగా

ను। చూడలేరు విమూఢులు, చూడగలరు। జ్ఞానదృష్టిని గలవారు సవ్యసాచి! ॥ ౧౦ ॥ యత్నమును జేయు యోగులీయాత్మను, తమ। యందునున్నట్లుజూతురు, యత్నమెంత। జేసినను, నవివేకులు చిత్త శుద్ధి। లేనివారలు, చూడగలేరు, పార్థ! ॥ ౧౧ ॥ తీక్ష్ణకరగతమైన ట్టి తేజమేది,। యఖిలజగము ప్రకాశించునట్లుజేయు। చున్నదో, చంద్రునియందు నున్న తేజ। మేదియో, యగ్నియందలిదేదో, య దియు। నామసంబంధమైనదిగా దెలియుము ॥ ౧౨ ॥ వసుధ నేను ప్రవేశించి, బలముచేత। ప్రాణులనుధరియించెడి వాడనౌదు। నలరసస్వ రూపుడనగు, నబ్జుడనయి। యోషధులనన్నిటిని జేతు, పోషణంబు ॥ ౧౩॥ పార్థ! నేజఠరాగ్నినై, ప్రాణికోట్ల। కాయములనాశ్రయించు చు। వాయువులను। ప్రాణమునపానమునుగూడి, భక్ష్యముల, చ। తుర్విధంబుల, బచనంబు దొడగిచేతు ॥ ౧౪ ॥ అన్నిప్రాణుల హృద యంబులందు నేను। జేరియుంటిని, గావున, స్మృతియు, మరియు। జ్ఞానమును, వానియపగమనంబు, గల్గు। చున్నయవి; సమస్తంబులౌ శ్రుతులచేత। తెలియదగువాడ, వేదంబు తెలిసినట్టి। వాడ, వేదాం తమును జేసినాడ నేను ॥ ౧౫ ॥ క్షరుడు నక్షరుడని, యిరువురుపురు షులు। లోకమున, సర్వభూతంబులును, క్షరుండు। మరియు కూట స్థుడక్షరపురుషుడగును ॥ ౧౬ ॥ వీరలిద్దరికంటెను, వేరుపురుషు డు త్తముడు, పరమాత్మయై యొప్పుచుండు। ఎవడు ముల్లోకములు ప్ర వేశించి తాను। వాని భరియించుచున్నాడో వాడె యవ్య। యుండు నగు నీశ్వరుండునై యొప్పుపార్థ ॥ ౧౭ ॥ క్షరునికంటె నతీతుడగాన, నేను। నక్షరునకంటె శ్రేష్ఠుడనగుటవలన। వేదముల, లోకమందు న, వినుతిగాంతు। నేను పురుషోత్తము డనని, నిర్మలాత్మ! ॥ ౧౮ ॥ ఈప్రకారముగా మోహమెడలియెవడు। నన్ను దెలియుచున్నాడో

నాడెముగను । వాడు సర్వజ్ఞుడై, సర్వభావములను । భారతా! నను భజియించు, వాడమిగుల ॥ ౧౯ ॥ చాలగుహ్యతమంబైన శాస్త్రమిది యా । చెప్పబడియెను పార్థ! నాచేతనసఘ! । యిట్టిలీశాస్త్రమును నరుడెరిగి, బుద్ధి । మంతుడును, కృతకృత్యుడై మనుకిరీటి! ॥ ౨౦ ॥

ఇది పురుషోత్తమప్రాప్తియోగమను పంచదశాధ్యాయము.

———::0::———

షోడశాధ్యాయము.

శ్రీభగ—భయము లేకుండుటయు, సత్త్వభావశుద్ధి । యుండుటయు ని ల్కడగ జ్ఞానయోగమందు । దమము, దానంబు, మరియు వేదాధ్య యనము । తపము, యజ్ఞంబు, మరి ఋజుత్వమును, పార్థ ॥ ౧ ॥ సత్యమును హింసలేకుంట, శాంతి, సిగ్గు । త్యాగమును, భూతముల యందు దయయు, మార్దవంబు, పిశునత్వమును లేని వర్తనంబు। లేకయుండుట క్రోధంబు, లేకయుంట । విషయలోలత, చాపల్యవృత్తి పార్థ! ॥ ౨ ॥ క్షమయు, తేజంబు, ధృతియు, శౌచంబు, గర్వ। మె డలియుండుటయును, ద్రోహమెవ్వడుసేయ । కుంట, యనునివి భార తా! కుదిరియుండు। పార్థ! యెవ్వడు దేవసంపదనుగూర్చి। పుట్టు నో, వానికెప్పుడు పొలుపుమీరి ॥ ౩ ॥ దంభమును,న భిమానంబు, ద ర్పము, నవి। పరుషత్వము, వినుముపార్థ! । క్రోధమును, నేకము ను, గల్గువానికి, కువలయమున । బుట్టునెవ్వడునాసురభూతిగూర్చి ॥ ౪ ॥ ముఖ్యముగ దేవసంపద మోక్షమునకు సమ్మతంబగు, నాసుర సంపదయును । బాలుపడియెడు, సంసారబంధమునకు । పొందకుము

శోకమును పాండుపుత్ర! యెపుడు । పుట్టితివినీవు, దేవతాభూతిగూర్చి॥ ౫ ॥ పార్థ! యీలోకమందున, ప్రాణికోట్ల । సృష్టిద్వివిధంబు నాసురసృష్టియనుచు । దైవసృష్టియునని, యందుదైవసృష్టి । చెప్పబడె, విశదముగ, నాచేతనిపుడు । నాసురంబైన సృష్టియదంత వినుము ॥ ౬ ॥ ఆసురస్వభావంబును, నందినట్టి । జనులు, ధర్మప్రవృత్తిని, తన్నివృత్తి । నేరరెరుగంగ, యుండమ, వారియందు । శుచియు, నాచారమును, సత్యరుచియునైన ॥ ౭ ॥ ఈజగమసత్య, మాశ్రయమేమి లేదు; । దగునియామకుడును లేనిదనుచు, వార । లనుచునుందురు, మరియును, నాలుగుగల । కూడికనుబుట్టె, వేరేమి జాడగలదు? । కామమే దీనికంతకు కారణంబు ॥ ౮ ॥ ఈజనులు, నవలంబించి యిట్టి దృష్టి । యల్పబుద్ధులు, నష్టాత్ములగుచు, క్రూర । కర్ములయి, శత్రువృత్తి, లోకక్షయంబు । కొరకు, బుట్టుచునున్నారు, కురువరేణ్య! ॥ ౯ ॥ మరియు, నిండించరాని కామంబునాశ్ర । యించి, దంభమానమదంబులెపుడుగల్గి । పాడుచింతల, నజ్ఞానవశత, దాల్చి । నిరతమును, నశాస్త్రియములౌ నియమములను । గల్గి, వర్తించుచుందురా కాపురుషులు ॥ ౧౦ ॥ అపరిమితమును, మరణమే యంతముగను । నమరియున్నట్టిచింతల, నాశ్రయించి । యిష్టకామోపభోగముత్కృష్టముగను । నరసి, యిదియింతెయని, నిశ్చయాత్ములగుచు ॥ ౧౧ ॥ పలువిధములగునాసలన్పాశములను । గట్టువడి, పరాయణతను, కామమునకు । క్రోధమునకును జిక్కుచు, కులుకుచుండి । కాంక్షసేతురు, కామభోగములకొరకు । నర్థసంచయములను, నన్యాయముగను ॥ ౧౨ ॥ ఇపుడు, నాచేత జిక్కినదీధనంబు । ముందు, నీమనోరథమును బొందగలను । కలదు నాకీధనం, బిక కలుగగలదు । ముందు, నాకీధనంబది పొందుగాను ॥ ౧౩ ॥ చంపబడియె నాచేత నీశత్రు, వింక । నితరశత్రువులను సంహరింపగలను । నేనె ప్రభుడను, భోగిని, నేనె సు

ఖిని। బలముగలవాఁడ, ధ్యాఢ్యసంపన్నుండ ॥ ౧౪ ॥ ధనముగలవాఁడ, సత్కులమునను బుట్టి। నాఁడ, నాతోడతుల్యుఁడున్నాఁడె యొకఁడు!। యజ్ఞముల జేతు, నిచ్చెదనన్యులకును। సంతసించెద, ననుచు నజ్ఞానవ శము। వలన, మోహింపబడినట్టివారలగుచు ॥ ౧౫ ॥ పలువిధంబుల, చిత్తవిభ్రాంతులగుచు। మోహజాలసమావృతబుద్ధులగుచు। కామ భోగానురక్తులై, కరము, నశుచి। యగు నరకములను, పతితులగుచు నుంద్రు ॥ ౧౬ ॥ ధ్యానితము దామెయెప్పుడు పొగడుకొనుచు। పెద్ద లనిరాకరించుచు, గర్వయు, ధన। మానమదములతో, నామమాత్రయ జ్ఞ। ములను, విధ్యుక్తమైన విధులనువదలి। చేయుచున్నారు దంభము చేత, వారు ॥ ౧౭ ॥ కామమును, క్రోధమును, నహంకారదర్పబల ములను, నాశ్రయించి, స్వపరశరీర। ములను నున్నట్టి, నను, ద్వేష బుద్ధిజూచి। యొరులశ్రేయస్సునోర్వక, యుందురెవరు ॥ ౧౮ ॥ అశు భులును, ద్వేషులును, క్రూరులయినయట్టి। యానరాధములను, నేని రంతరంబు। నల్లసంసారములయందు, నసురయోని। లందు, ద్రో యుచునున్నాఁడ నట్టివారి ॥ ౧౯ ॥ జన్మజన్మంబులందున, సవ్యసాచి!। మూఢులాసురయోనినిబొంది, పిదప। పొందుదురధోగతిని, నన్ను బొందకుండ ॥ ౨౦ ॥ పార్థ! కామము, క్రోధలోభంబుల నెడు। మూఁడువిధములుగల, యివి, ముఖ్యముగను। నరకమునకును ద్వా రంబు, నాశకరము। నాత్మ, కిమూఁడుత్యాజ్యంబులందు చేత ॥ ౨౧ ॥ పార్థ! మూఁడగునీతమోద్వారములను। విడిచిననరుండు, తాజేయు విడువకెపుడు। తనకు శ్రేయస్కరంబగుదాని, నవల। పొందుచున్నాఁ డు యాతడు మోక్షగతిని ॥ ౨౨ ॥ వినుముదే మనుష్యుడు శాస్త్ర విధినివిడిచి। కామచోదనవర్తించు, గడగివాఁడు। పొందనేరడుసిద్ధిని, పొందలేడు। భువిసుఖంబును, మోక్షంబు బొందలేడు ॥ ౨౩। చే యఁదగినదియిది, మఱిచేయరాని। దదియు, నను వ్యవస్థితియందు నెప్పు

మునీకు। శాస్త్రమే ప్రమాణము, పార్థా! శాస్త్రవిధిని। జెప్పబడి నట్టి కర్మంబు నొప్పమీర। తెలిసికొని చేయదగుదువు, తివిరియిచట॥
ఇది దైవాసురసంపద్విభాగయోగంబను షోడశాధ్యాయము.

---

## సప్తదశాధ్యాయము.

అర్జున—శాస్త్రవిధులను విడిచియు, శ్రద్ధతోడ। నెవరు యజ్ఞంబుజేయు దు, రిట్టివారి। శ్రద్ధయెట్టిది? శ్రీకృష్ణ! సాత్వికంబొ? । తామసమొ? రాజసమొ? చెప్పదగుదువీవు ॥ ౧ ॥

శ్రీభగ—పార్థా! దేహధారులకు, స్వభావముననను। బుట్టినట్టి యాశ్రద్ధ యు, మూడువిధము। లగుచున్నది, సాత్వికంబనియు, రాజ।సంబు, తామసమని, వానినరణివినుము ॥ ౨ ॥ పార్థా! ప్రాణులందరికి, స త్వానురూప। మైన శ్రద్ధయుగల్గును, నందువలన। దలప పురుషుడు నగును శ్రద్ధామయుండు। తాను నేశ్రద్ధగలవాడో, తానునదియె॥౩॥ సాత్వికులు దేవతలను, రాజసులు యక్ష। రాక్షసుల, తామసులు ప్రేతలను, మరియును। భూతగణముల, పూజింత్రు పోలుపుమీర॥౪॥ దంభమును నహంకారమును దాల్చినట్టి। కామరాగభయంబులు గలి గినట్టి। యేనరులు శాస్త్రవిహితముగానియట్టి। ఘోరతపముల జేయు చున్నారో, వారు; ॥౫॥ అట్టియవివేకులీదేహమందునున్న। భూతవర్గం బుత త్సాక్షిభూతమైన। నన్నును, కృశింపజేయుచున్నారు, వారి। న ల్లనాసురనిశ్చయులనుచు, గనుము ॥ ౬ ॥ మూడువిధములు గలిగినభో జనంబు। ప్రాణులందరికిని, ప్రియంబగుచునుండు;। నట్లెదానంబు త పమును, యజ్ఞమును, ప్రి। యంబగును, వానిభేదము నరసి వినుము॥ ౭॥ ఆయురారోగ్యసత్వబలాభివృద్ధి। కరములును, ప్రీతిసుఖవృద్ధికర ములు, రస। యుక్తములు, చిరకాలసాయులును, చమురు। తోడ

గూడిహృద్యంబులైదోచునట్టి। కట్రభోజనములు, సాత్విక ప్రియము
లు ॥ ౮ ॥ మిగుల చేదను, పులుపును, మిగులనుప్పు। మిగులవే
డియు, కారంబు మిగులగల్గి। ద్రవము లేక, విదాహకరంబులగు
చు। గడగి, దుఃఖశోకముల రోగములనిచ్చు। చవులు, నాహార
ములు, రాజసప్రియములు ॥ ౯ ॥ యామమేగిన, చల్లనై యమరు
నదియు। గతరసంబును, దుర్గంధకలితమైన। యట్టిదియుపక్వమై
న రాత్ర్యంతరితము। నవలయపవిత్రమైన యాహారమేదో। య
దియె, తామసులకును ప్రియంబు, పార్థ! ॥ ౧౦ ॥ విడిచిఫలకాం
క్ష, విధిసృష్టవిధులచేత। యజ్ఞమిది, చేయదగినదే, యనుచు మనసు
నందు నిశ్చయిపరచుక, యాచరింప। బడినయజ్ఞంబు, సాత్వికఫలద
ముగును ॥ ౧౧ ॥ ఫలమపేక్షించి, దంభంబు పరిగణించి। యాచరిం
పగబడుచుండు యజ్ఞమేది। యదియు భారత! రాజసయజ్ఞమగును ॥
౧౨ ॥ విధివిధానముగానిది, విప్రులకును। నన్నదానములేనిది, యు
టులె, మంత్ర। దక్షిణలు లేనిదియును, శ్రద్ధావిరహిత। మైనయజ్ఞ
ము, తామసంబనగబరగు ॥ ౧౩ ॥ దేవగురు విప్రపండితసేవ, యార్జ
వంబు, శౌచ, మహింసయు, బ్రహ్మచర్య। మును, శరీరప్రధానమౌ
ముఖ్యతపము। గాను, చెప్పగబడియెను, కలుషరహిత! ॥ ౧౪ ॥ ప్రి
యము, సత్యంబు, హితము, నుద్వేగకరము। గాని వాక్యము; స్వా
ధ్యాయమూనియభ్య। సించుటయు, నేదియోయది, చెప్పబడును।
పార్థ! వాగ్రూపమైన తపంబుగాగ ॥ ౧౫ ॥ మనమునకు సమాధాన
మౌ మందివృత్తి। మౌనమును, భావసంశుద్ధి, మనమునిగ్ర। హిం
చుటయు, నను నిట్టివి యెపుడుచెప్ప। బడుచునుండు, మానసికతపం
బటంచు ॥ ౧౬ ॥ పరులసత్కృతికిని, బహుమానమునకు। పూజకొర
కును, దంభముపూని, చేయ। బడు తపంబది, యీలోకమందుచం
చ। లంబు, నధ్రువమగుటజే, రాజసంబు। ననుచు, చెప్పంగబడియె

ను, వినుతచరిత! ॥ ౧౮ ॥ మూఢనిశ్చయమున, దేహపీడచేత । పరుల నాశంబుకొరకు, తపంబునేది, । యాచరింపఁబడుచుండు నదియు చెప్ప । బడును తామసంబైన, తపంబటంచు ॥ ౧౯ ॥ ఇవ్వఁదగినదియని, దానమేది, ప్రత్యు । పకృతిఁజేయఁగ యట్టి సత్పాత్రునకును । కడఁగు నక్షేత్రమున, బుణ్యకాలమందు । దానమిచ్చిన, సాత్త్వికదానమగు ను ॥ ౨౦ ॥ ఫలముఁగోరుచునైనను, ప్రత్యుపకృతి । కోరకునైన, మనోవ్యథగూరిదైన । దానమిచ్చిన, రాజసదానమగును ॥ ౨౧ ॥ ఏవి రి యేదానము నికృష్టదేశకాల । ముల, నపాత్రులకొఱకునై మఃఖ్య ముగను । నీయఁబడును, సత్కారరహితమును, నవ । మానయుక్తము నైన యాదానమెపుడు । తామసంబని చెప్పఁదగు కిరీటి! ॥ ౨౨ ॥ వినవె 'ఓంతత్స' తని మూఁడువిధములుగను । బ్రహ్మనిర్దేశము సు చెప్పబడియె, మరియు । దాని, నల బ్రాహ్మణులును, వేదములు, యజ్ఞ । ములును, నిర్మింపబడినవి, మున్ను, పార్థ! ॥ ౨౩ ॥ అందు చే బ్రహ్మవాదుల, యాగమోక్త । యజ్ఞదానతపఃక్రియలన్ని పార్థ! సతతమోంకారపూర్వకోచ్చారణమున । బరగ, ప్రారంభమునుఁజేయ బడుచునుండు ॥ ౨౪ ॥ మోక్షమును గోరువారలు మఱందుగాను । తత్తనెడిదానిఁబల్కుచు, దాముఫలము । కాంక్షసేయక పలువిధకర్మ లైన । యజ్ఞదానతపంబుల, నాచరింత్రు; ॥ ౨౫ ॥ తగఁబ్రయోగింప బడును సత్తనెడిపదము । కర్తనెడు నర్థమున, శ్రేష్ఠకరముననెడు, నర్థమందున, సచ్ఛబ్దమట్టులె చెప్ప । నగు, బ్రశస్తమౌ కర్మంబునందు గూడ ॥ ౨౬ ॥ యజ్ఞదానతపంబులయందునిష్ఠ । పల్కఁబడుచుండుఁ సత్తని; భగవదర్థ । మైన, యాకర్మమును, సత్తెయగును పార్థ! ౨౭ ॥ మరియు నశ్రద్ధచేత హోమంబునేది । చేయబడుచుండు, తపమేదిచేయబడునొ । యివ్వఁబడునేది దానంబు, నివియునన్ని । పల్కఁబడును నసత్తని, ఫలకరంబు । గాదిహపరంబులకును, దాగాని యదియు ॥ ౨౮ ॥

ఇది శ్రద్ధాత్రయవిభాగయోగమను సప్తదశాధ్యాయము.

## అష్టాదశాధ్యాయము.

అర్జున—వేరువేరుగ దెలియంగోరుచుంటి। త్యాగసంన్యాసములయొ
క్క తత్త్వమేను;। కేశిమర్దన! యోహృషీకేశ! శౌరి!॥ ౧ ॥
శ్రీభగ—అర్జునా! తత్త్వవిదులు సంన్యాసమనగ। కామ్యకర్మవిడుచు
టగాను, మరియు। కర్మలన్నియుజేసి తత్కర్మఫలము। నీశ్వరార్పణ
జేయుటయే, కిరీటి!। త్యాగమనియును, బల్కిరి తత్త్వవిదులు ॥ ౨ ॥
సర్వకర్మయు, పార్థ! దోషంబువలెను। త్యాజ్యమందురు కొందరు
తత్త్వవిదులు। యజ్ఞదానతపఃకర్మలవి యూపిడువ। గూడదని, వల్కుదు
రు మరికొందరనఘ! ॥ ౩ ॥ త్యాగమునుగూర్చి నానిశ్చితార్థమీవు।
వినుము, భారత! మును పె నేవివరణముగ। దెల్పితినిగద, త్యాగంబు
త్రివిధముగను ॥ ౪ ॥ యజ్ఞదానతపఃకర్మమనఘ! విడువ। దగదు; చే
యంగవలయు: నాదానయజ్ఞ। ములు, దపంబు బావనునిగ బుధునిజే
యు ॥ ౫ ॥ పార్థ! పూర్వోక్తకర్మముల్ ఫలముసంగ। మునువిడిచి
చేయదగినవే, విమమునామ। పరమసిద్ధాంతమిద్దియె నాపరమమత
ము ॥ ౬ ॥ నియతకర్మలవిడుచుట నీతిగాదు;। వానినవివేకవశమున,
వదలుటయును। తామసత్యాగమనబడు, ధరణియందు॥ ౭ ॥ బాధయను
చు, దేహక్లేశభయమువలన। వదలునో, కర్మమెవ్వడు, వానిత్యాగ।
మనగబడు రాజసత్యాగమనుచు, దాని। ఫలము బొందగనేరడువాడు
పార్థ! ॥ ౮ ॥ విధిగజేయగదగినదే విహితకర్మ। మనుచు, నెవ్వడు
కర్మంబునాచరించు। ఫలముగోరక, సంగంబువదలి, వాని। త్యాగ
మనబడు సాత్త్వికత్యాగమనుచు ॥ ౯ ॥ సాత్త్వికత్యాగి, తెగినసంశయ
ములుగల। బుద్ధిమంతుడు, ద్వేషంబుపొందడెప్డు। దశుభకర్మమైనక
ర్మంబు ననుసరించి। కనడు ప్రీతిని సుఖదమౌ కర్మయందు ॥ ౧౦ ॥
పార్థ! నిశ్శేషముగ కర్మవదలియుండ। గాయధారికి శక్యంబు కా
దు, గాన। కర్మమును జేసియెవ్వడు కర్మఫలము। వదలునో, త్యాగి

యని వాఁడు పలుకఁబడును ॥ ౧౧ ॥ మించు, నిష్ట, మనిష్టంబు, మిశ్ర
మనుచు। కర్మఫలమును త్రివిధమై, కడగిదాని। గోరువానికి, నికమీ
దగోరకుండు। వాని, నెన్నఁడుఁనంటవాఫలములరయ ॥ ౧౨ ॥ సర్వ
కర్మాంతమైన యాత్మజ్ఞానమతము। నందు, కర్మంబులన్నిటికైదుకా
రణములు, చెప్పఁగబడియెను, సుముఖుడవయి। వినుమిం, యకారణ
ముల, జెప్పెదనునీకు ॥ ౧౩ ॥ వినుము దేహము, జీవుండు, వేరువేరు।
విధములగు నింద్రియంబులు, వివిధములగు। భిన్నచేష్టలు, మరియు
ను పీనియందు। పంచకము నధిష్ఠానదేవతయునగును ॥ ౧౪ ॥ మనము
నను, శరీరమున, వాక్కున, నరుండు। కర్మమెయ్యదిదా జేయఁగడగు
నదియు। న్యాయమైననుం, విపరీతమైనగాని। దానికీహేతువులునైదు
తప్పకగును ॥ ౧౫ ॥ ఇట్లగుటచేత, నెవడసంస్కృతమ్మునైన। బుద్ధిగల
వాఁడు, నగుటచే మూఢవృత్తి। నాత్మయే, కేవలము కర్తయనుచు ద
లచు। నట్టిదుర్మతి, తత్వంబు నరయలేఁడు ॥ ౧౬ ॥ ఎవఁడహంకారభా
వంబు నెడలియుండు। నెవనిబుద్ధిని నంటదో యేఫలాశ। జనుల, వీ
రిని నాతఁడు చంపినైన। కాఁడు హంతయుం, కర్మచేకట్టువడఁడు ॥౧౭॥
జ్ఞానమును జ్ఞేయమును పరిజ్ఞాతయనెడు। కర్మచోదనములు మూఁడు,
కర్తృకర్మ। కరణములుమూఁడు, కర్మసంగ్రహమునగును ॥ ౧౮ ॥ కపిలు
శాస్త్రమైన, గుణసంఖ్యానమనెడి। గ్రంధమున చెప్పఁబడియెను, కర్తృ
కర్మ। జ్ఞానమును త్రివిధంబుగ, సత్వమాది। యైన గుణభేదముఁబట్టి,
యవియునీవు। వినుము శాస్త్రక్రమంబుగ, విమలచరిత। ॥ ౧౯ ॥ ఎట్టి
జ్ఞానంబుచేతను, నెల్లభూత। ములనఖండము, నవ్యయమును, నొక
టియు। నైన, యాత్మస్వరూపంబు దానుజూచు। చుండు, నాజ్ఞాన
మును దెలియుము, కిరీటి। । సత్వగుణమున బుట్టిన జ్ఞానమనుచు ॥ ౨౦ ॥
సర్వభూతంబులందున, జ్ఞానమేది। భేదభావముచే భిన్నవిధములైన।
పలువిధస్వరూపంబుల దెలియుచుండు। జ్ఞానమని, దెలియుము రాజ

సంబటంచు ॥ ౨౧ ॥ అవల, నొక కార్యమైన, దేహాదులందు । సక్తమై నయేజ్ఞానము సర్వమదియె । యనుచు, హేతువులేనిది, యల్పఫల ద । మై, యథార్థముకానిది యైనయట్టి । జ్ఞానమది, చెప్పబడె, తామసంబటంచు ॥ ౨౨ ॥ కర్మమేది, నియతము, సంగరహితంబు । నైనదై, ఫలాపేక్ష లేనట్టివాని । చేత, రాగము ద్వేషంబుచేరనీక । సలుపబడుచుండు, నాకర్మసాత్వికంబు ॥ ౨౩ ॥ అలయహంకారయుక్తుడై, ఫలముగోరు । కర్తచేతను, బహువిధకష్టములను । గలిగియున్నట్టి యేకర్మ సలుపబడునో । యదియె, రాజసమా కర్మమనగబరగు ॥ ౨౪ ॥ ముందుగలిగెడు ఫలమును, నందువలన । గలుగునాశంబు, హింసయు, కర్తయైన । తనదుసామర్థ్యమును, మదిదలపకుండ । మోహవశమున, నేకర్మమొదలుపెట్ట । బడునో, యదితామసంబనివలుకబడును ॥ ౨౫ ॥ ముక్తసంగు, డహంకారమును త్యజించి । పలుకవాడును, నుత్సాహపరుడు, ధైర్య । వంతుడును, ప్రాప్తియందు నప్రాప్తియందు । నేవికారంబుబొందనియట్టి, కర్త । యర్జునా! యెప్డు సాత్వికుండనగబరగు ॥ ౨౬ ॥ ఎవడు నన్నురాగమునుగల్గి, యెపుడు, కర్మ । ఫలముగోరుచునుండు, ద్రవ్యంబుగోరి । పరులకును హింసజేయు స్వభావపరుడు । శుచివివర్జితుడై, హర్షశోకములను । గల్గియుండునో, రాజసకర్తవాడె ॥ ౨౭ ॥ అలమనోనిగ్రహములేని యట్టివాడు, బుద్ధిహీనుడు, స్తబ్ధుండు, మోసగాడు । పరులనవమానమును జేయువాడు, దుఃఖ । శీలు, డాలస్యముగ పనుల్జేయువాడు । నలసుడౌ కర్త, తామసుడనగబరగు ॥ ౨౮ ॥ పార్థ! సత్వాదిగుణములవలన, త్రివిధ । ముగను భేదంబునొందిన, బుద్ధిధైర్య । ములవిభేదంబు, నిశ్శేషముగను, వేరు । వరది, చెప్పగబడును, తత్పరతవినుము ॥ ౨౯ ॥ విను, ప్రవృత్తియు, మరియు నివృత్తియటులె । చేయదగు కార్యమును, మరిచేయరాని । కార్యమును, భయాభయములు, గడ

గిబంధ। మోక్షముల, గుర్తెరింగిన బుద్ధియేదో। పార్థ! సాత్త్విక బుద్ధినాబరగు నదియె ॥ 30॥ ధర్మము నధర్మమును, చేయదగినదాని। చేయదగనిది, యేబుద్ధిచేత, తత్వ। భిన్నముగ, దెలియునో, యట్టిభే దబుద్ధి। యగుచునున్నది రాజసంబైనబుద్ధి ॥ 31 ॥ మరియు నేబుద్ధి తలచు, తమస్సుచేత। కప్పబడి, యధర్మంబును నొప్పుమీర। ధర్మము గ, నట్లె సర్వపదార్థములను। దలచు విపరీతముగ, నది తామసంబు॥ 32 ॥ పార్థ! యోగంబుచేతను, వ్యభిచరించ। నట్టి యేధృతిచేత ను, నలమనశ్క్రి। యలును, మరియును, ప్రాణేంద్రియములక్రియలు। బాగుగను నియమింపగ, బడుచునుండు। నాధృతియెమావె సాత్త్వి కంబనగబరగు ॥ 33 ॥ పార్థ! యాసక్తితోడను, ఫలముగోరు। మను జు, డేధృతితోడ, ధర్మార్థకామ। ములధరించుచునున్నాడో, పలుక బడియె। నదియె, రాజసమా ధృతియనుచు, పార్థ! ॥ 34 ॥ కరముకు త్సితబుద్ధినిగల, పురుషుడు। యేధృతినిబూని విడువడో యెపుడు, నిద్ర। సాధ్వసవిషాదమదదుఃఖసంభ్రమములు। నాధృతియె, తామసధృతియ నగబరగు ॥ 35 ॥ భారతా! వినుమిపుడు నావాక్యవలన। త్రివిధ మాసుఖమును నీవు, దేనియందు। ననయమురమించు, నభ్యాసమున నరుండు। దేనదుఃఖాంతమునుబొందు, దానినిపుడు ॥ 36 ॥ తొలుత నేయాసుఖము విషతుల్యమగుచు। నంతమందున నమృతతుల్యంబు నగునో। యాత్మబుద్ధిప్రసాదజంబైనయట్టి। యాసుఖము, సాత్త్వికం బైనదగుచుబరగు ॥ 37 ॥ పార్థ! విషయేంద్రియముల సంబంధమున ను। నాదినెయ్యది యమృతతుల్యంబునగుచు। నంతమందున విషతు ల్యమగునో, యాసుఖంబు రాజసంబైన సుఖంబునగును॥ 38॥ ఆ దియందును నంతంబునందు తనకు। నేసుఖము మోహకరమునై, యెపుడు, నిద్ర। మత్తుచేత, నాలస్య ప్రమాదములను। బుట్టునో, దా ని తామసంబుగనుగనుము ॥ 39 ॥ ప్రకృతిజన్యంబులైన, సత్వంబు మొదలు। మూడుగుణముల చేత విముక్తమైన। సత్వమొకటియు

నులేదు జగమునందు। నైన, దివియందు సురలందునైన, గాని ॥
౪౦ ॥ వారివారి స్వభావంబు వలనబుట్టు। నట్టి, గుణభేదముఁబట్టి,
యవనియందు। బ్రాహ్మణక్షత్రియులకును వైశ్యశూద్ర। లకును వి
భజింపబడియె కర్మములు, పార్థ! ॥ ౪౧ ॥ దమము, శమము, నార్జవ
మును, తపము మరియు। క్షాంతి, శౌచము, జ్ఞాన, విజ్ఞానములును।
ఆస్తికత్వంబునను నివి, యన్నియును, స్వ। భావజంబులౌ కర్మముల్
బ్రాహ్మణునకు ॥ ౪౨ ॥ శౌర్యమును, ధృతి, తేజంబు, శక్తి, యు
ద్ధ। మందు పారిపోకుండుట, యవనిజనుల। నేలుటయు, దానమని
యెడునివి స్వభావ। జంబులౌ కర్మములునగు, క్షత్రియునకు ॥ ౪౩ ॥
భూమిదున్నుట, గోవులపోషణంబు। వర్తకము, స్వభావజములౌ, వై
శ్యకర్మ। ములునగును, పరిచర్య, శూద్రులకును స్వ। భావజనకమౌ
కర్మమై బరగు పార్థ! ॥ ౪౪ ॥ అభిరతుండయి తనకర్మయందు నరుడు।
పొందుచున్నాడు సంసిద్ధి, పూనియెట్టు। లాస్వకర్మనిరతుడు కృతా
ర్థుడగునో। దానివిధిచెప్పెదను నీకు, దెలిసివినుము ॥ ౪౫ ॥ పుట్టు, నె
వ్వనివలన, నీభూతసంచ। యంబు, నెవ్వనిచే వ్యాప్తమాయె, నీస।
మస్తలోకంబులును, వాని, మానవుండు। పూనితనకర్మచేతను పూ
జచేసి। పొందుచున్నాడు సంసిద్ధి పొలుపుమీర ॥ ౪౬ ॥ బాగుగను
నాచరింపగబడినయట్టి। పరుని ధర్మంబుకంటెను, విరసముగను। చే
యబడిన స్వధర్మంబు శ్రేష్ఠమగును। పొందడెవ్వడు కిల్బిషమును,
స్వభావ। నియతమౌ కర్మజేసెడు నియమపరుడు ॥ ౪౭ ॥ ఓయికౌం
తేయ! వినుదోషయుక్తమైన। సహజమౌకర్మ విడువంగజనదుసుమ్ము।
కారణంబేమియన, సర్వకర్మములును। సర్వదా కప్పబడియె దోష
ములచేత। నగ్ని పొగచేత నావృతంబైన పగిది ॥ ౪౮ ॥ అంతటను
సంగరహితంబునైనబుద్ధి। మరిజయింపగబడినట్టి మనము, నుడిగి।
నట్టి యాసలుగలవాడు, నన్నికర్మ। ముల ఫలంబును విడుచుటవలన
దాను। పరమమైన నైష్కర్మ్యసిద్ధిని, బడయువాడు ॥ ౪౯ ॥ పార్థ! యిప్పు

ధిసిద్ధిని బడయునాత। డేవిధిని, బ్రహ్మమును జేరు, నావిధంబు, నైన సర్వోత్తమంబైన, జ్ఞాననిష్ఠ। వినుము సంక్షేపముగనీకు, విశదపర తు॥ ౫౦॥ అర్జునా! పరిశుద్ధమానట్టి బుద్ధి, తోడగూడుచు, ధైర్యం బుతోడ, నాత్మ। వేగనియమించి శబ్దాదివిషయములను। వదలి, రాగము ద్వేషంబు పారదోలి॥ ౫౧॥ నిర్జనప్రదేశమునొంది, నిరతము, లఘు। భోజియై, మనోవాకాయములను నిగ్ర। హించి, ధ్యాన యోగపరుండు నెప్పుడగుచు। నవల వైరాగ్యమునుదాను నాశ్రయిం చి॥ ౫౨॥ తనయహంకారమును బలదర్పములను। కామమును, క్రోధమును, పరిగ్రహము, విడిచి। శాంతుడై, మమకారంబు సాగ దోలు। నాతునగు సమర్థుడు బ్రహ్మభావమునకు॥ ౫౩॥ బ్రహ్మని ష్ఠుడు, నిర్మలమనముగలిగి। శోకమొందడు నష్టవస్తువునుగూర్చి। రాని వస్తువు కోరడు, ప్రాణివర్గ। మంత నంతట సముడయి, పొందుచు న్న। వాడు నాయందు, నిచ్చలు, పరమభక్తి॥ ౫౪॥ ఎంతవాడనో మఱియునే నెట్టివాడ। నగుదునో, భక్తిచేతను, నదియధార్థ। ముగ నెరింగెడు; నిష్కపముగ నెరింగి। తత్త్వముగనన్ను, నాయందుతాను జొచ్చు॥ ౫౫॥ పూనినే నె ప్రాప్యస్థానముగనుగల్గి। సర్వకర్మల న ర్వదా సలుపుచుండి। యైన, నాయనుగ్రహమున, నందువాడు। న వ్యయంబును, శాశ్వతంబైన పదము॥ ౫౬॥ కావున వివేకబుద్ధిచే కర్మలన్ని। నీవు నాయర్పణమెజేసి, నేనెపరమ। గతిగనెంచుచు, బు ద్ధియోగంబునాశ్ర, యించి, నాయందు నీచిత్తమెపుడు నిల్పు॥ ౫౭॥ చిత్తమునునీవు నాయందు జేర్చితేని। సర్వదుఃఖములను, మత్ప్రసా దమునను। దాటగలవీవు, ఫల్గునా! దానివిడిచి। నీవహంకారవశమున నిలిచి, వినక। పోదువేనియు, విను, చెడిపోదువీవు॥ ౫౮॥ అర్జునా! నీవహంకారమాశ్రయించి। చేయనుదురంబునని తలచితవయేని। య గుచు మిథ్యయౌ, నీనిశ్చయంబు నిదియు। కడగి ప్రకృతియౌ నియమిం పగలదునిన్ను॥ ౫౯॥ నీస్వభావజమైనట్టి నీదుకర్మ। చేత,బద్ధుడ

వై, యేదిచేయనిచ్ఛ । యింపవో, మోహావశమున, నదియొకేయ
గలవు పరవశుడవువయి, కడగి పార్థ! ॥ ౬౦ ॥ ఈశ్వరుడు సర్వప్రా
ణుల హృదయసీమ । లందు, నివసించి, దేహంబులనెడు యంత్ర ।
ములనధిష్ఠించియున్న జీవులను, తనదు । మాయచేతను, భ్రమియిం
పజేయుచుండు ॥ ౬౧ ॥ పార్థ! యాతని సర్వాత్మభావమునను । శర
ణుబొందుము, మరితత్ప్రసాదమునను । పరమశాంతియు, శాశ్వతపర
మపదము । బొందగలవీవు సందేహమిందువలదు ॥ ౬౨ ॥ గోప్య
ములనెల్ల మిక్కిలి గోప్యమైన । జ్ఞానమిది, నీకు నాచేత, సాంత
ముగను । చెప్పబడియెను, దీనిని శ్శేషముగను । తెగ విమర్శించి,
నీయిచ్ఛ దవులునెట్టు । లాప్రకారముగానె, నీవాచరింపు ॥ ౬౩ ॥
గోప్యములలోన మిక్కిలి గోప్యతమము । పరమయుత్కృష్టమైన
నావాక్యమీవు । తిరిగివినుమయ్య! నాకతిదృఢముగాను । నిష్టుడ
వుగాన చెప్పెద హితము నీకు ॥ ౬౪ ॥ నీవు సంబును నామీదనిల్పు
వాడ । వగుము, మద్భక్తుడవెకమ్ము యహరహంబు । నన్నెపూజిం
పుచుండుము, నాకెనీవు । మ్రొక్కుచుండుము, దానిచేబొందగలవు ।
నన్నె, యిష్టుడవైతివి నాకునీవు । తవిలి జేతు బ్రతిజ్ఞ యథార్థముగ
ను ॥ ౬౫ ॥ సర్వధర్మంబులనునీవు చక్కవిడిచి । యొకని నేనన్ను శ
రణంబు నొందుమోయి; । పార్థ! విడిపింతుసర్వపాపములనుండి, ని
న్ను, నే, దుఃఖపడకుమునీవు నెపుడు ॥ ౬౬ ॥ ఇదితపోరహితునకును
మదినిభక్తి । లేనివానికి, విననిచ్ఛలేనివాని । కనయముననన్ను దూ
షించునట్టివాని । కి, వొకప్పుడు నుపదేశమియ్యదగదు ॥ ౬౭ ॥ పర
మగోప్యంబు నగునిది, పార్థ! నాదు । భక్తులకు చెప్పునెవ్వడు, వా
డునాకు । చాలయుత్కృష్టమగు భక్తిసల్పి, నన్నె । సంశయము లేక
పొందగజాలువాడు ॥ ౬౮ ॥ అతనికంటెను మనుజులయందు నాకు ।
ప్రియముమిక్కిలిచేసెడు ప్రియుడు లేడు; । ముందునెన్నడు, నీభువి
[illegible], వాని । కంటెనెక్కువయిష్టుండు కల్గబోడు ॥ ౬౯ ॥ పపురు

షుడిట్టి సంవాదరూపమైన। ధర్మ్యయుక్తమౌ గ్రంథంబు దాబఠించు।
జ్ఞానయజ్ఞంబుచేతను, వానిచేత। నేనుపూజింపబడుదు నానిశ్చయ
మిది ॥ ౭౦ ॥ ఎవ్వడనయంబు, శ్రద్ధతో। నిది, యసూయ। నదలివిను
పాపముక్తుడై వాడునొందు। పుణ్యకర్ములుజేసిన పురుషులొందు।
భవ్యలోకంబులనుతాను, పార్థ! యెపుడు ॥ ౭౧ ॥ పార్థ! యేకాగ్రచి
త్తంబువలన, నీకు। వినగబడియెనే శాస్త్రంబు విశదముగను? సో
యెనే నీకు నజ్ఞానమునగలిగిన। యట్టియవివేకమంతయునణగి, పార్థ!॥

అర్జున—పోయె నవివేకమంతయు, బొందబడియె। నెరుక, నీయనుగ్ర
హమున నీశ! నేను। విగతసందేహుడనునైతి, విధిగజేతు। వాక్యము
ను జేయగలవాడ పరమపురుష! ॥ ౭౩ ॥

సంజ—ఈవిధంబుగ, నే, వాసుదేవునకును। నామహానుభావుడునైన
యర్జునునకు। జరిగినట్టియు, నాశ్చర్యకరమునైన। పులకలెగయించు
సంవాదమాలకించితి ॥ ౭౪ ॥ వ్యాసుని యనుగ్రహంబున, పరమమై
న। యీరహస్యమునగు యోగమేనువింటి, దానె ప్రత్యక్షముగ
జెప్పి దనుపుచున్న। కేవలము యోగవిభుడగు కృష్ణువలన ॥ ౭౫ ॥
రాజ! యద్భుతమును, పవిత్రంబునైన। వాసుదేవార్జునుల సుసంవా
దమిదియు। తలచితలచి యనారతమలరుచుంటి ॥౭౬॥ మరియు నత్య
ద్భుతంబయి వరలునట్టి। వాసుదేవుని విశ్వరూపంబు, రాజ!, చాల
స్మరియించి స్మరియించి సంతసింతు। మాటిమాటికి విస్మయమగున్నడ
నయి ॥ ౭౭ ॥ ఉండునేపక్షమందున, యోగమునకు। నీశ్వరుండగుకృ
ష్ణుండు, నెచటనుండు! నాధనుర్ధరుడైనట్టి యర్జునుండు। యచట
నుండును, సిరి, విజయంబు, భూతి। స్థిరమునగు నీతి యనుచు నా
పరమమతము ॥ ౭౮ ॥

ఇది శ్రీమహాభారత, భీష్మపర్వాంతర్గతంబైన భగవద్గీతో
పనిషత్తునందలి మోక్షసన్యాస యోగంబను
నష్టాదశాధ్యాయంబు
సంపూర్ణంబు.

## శ్రీభగవద్గీతామాహాత్మ్యము.

-::0::-

ధర—షడ్గుణైశ్వర్యసంపన్నా! సర్వలోక। ప్రభువ, ప్రారబ్ధకర్మలఫలమున నుభ। వించువానికి, నీయందు నెటులగల్గు। నిశ్చలంబైనభక్తి, దెలా నిగమవినుత! ॥ ౧ ॥

విష్ణు—కడగియెవ్వాడు ప్రారబ్ధకర్మఫలము। ననుభవించుచునున్న వాడైన గాని। నిచ్చలునుగీతాభ్యాసనిరతుడైన, వాడెముక్తుడు, గడుసుఖ వంతుడగుచు। కర్మములచేత నెప్పుడు కట్టువడడు ॥ ౨ ॥ స్థిరతగీతల ధ్యానంబుజేయుచున్న। వాని, నెప్పటికిని, మహాపాతకాము। లంటుకుండను, తామరయాకుమీది। యుదకమట్లానిస్పృశియింపకుండు నట్లు ॥ 3 ॥ ఈశుగీతలపుస్తకమెచటనుండు, నెచటవానిపారాయణం బెప్పుడుజరుగు, నాస్థలంబందునుండు, బ్రయాగ మొదలు। నవని గలతీర్థరాజంబులన్నిగూడి ॥ ౪ ॥ సకలదేవతల్, ఋషులును, సకలయోగి। వరులు, గోపాలగోపికల్, పన్నగులును। నారదుండుద్ధవుడు, హరిద్వారపాలి। కులు,సహాయము జేయుచుగూడియుందు। రెటబ్రవర్తించు గీతలు, నెపుడునచట ॥ ౫ ॥ సలుపబడుచుండు, గీతావిచారపఠన। పాఠనంబులు శ్రవణంబు బరగనెచట। నేను భూదేవి! యటనిల్తు నిశ్చయముగ ॥ ౬ ॥ అవనినేనుంటి గీతలనాశ్రయించి। గీతలేనాకు నుత్తమగృహముదావె। అరయనేను గీతాజ్ఞానమాశ్రయించి। మించి ముల్లోకములను పాలించుచుంటు ॥ ౭ ॥ అరయనీభగవద్గీత పరమవిద్య। యర్ధమాత్రాక్షరానిత్యమైనదియును। యవల, నది, యనిర్వాచ్యపదాత్మికంబు। నగుట, బ్రహ్మస్వరూపంబెయగు ధ్రువంబు ॥ ౮ ॥ అలచిదానందరూపుడైనట్టి, కృష్ణు। డర్జునునిగూర్చి, వేదత్రయస్వరూప। ముచు, పరానందమును, శీఘ్రముగను తత్వ। సారబోధకమైన

శాస్త్రిమంత। స్ఫాయముగానుపదేశించె, సహాయుడగుచు ॥ ౯ ॥
అనుదినమును నష్టాదశాధ్యాయములను । మనుజుడెవ్వడు నిశ్చలమా
నసమున । జపముసేయునో, వాడు విజ్ఞానసిద్ధి । బొంది, పరమపదం
బును జెందగలడు ॥ ౧౦ ॥ నిత్యమునుపూర్తిగ పఠింపనేరకున్న । సగ
మునైనను పఠియింపజాలువాడు, పొందుగోదానమిచ్చిన పుణ్యఫల
ము । నెంతమాత్రము సందేహమింతయు లేదు ॥ ౧౧ ॥ పరగ మూడవ
భాగంబు, బఠనజేయు । వాడు పొందు గంగాస్నానఫలముతాను ।
హరిషడంశంబు బఠియించు నరుడు, సోమ । యాగఫలమును బొం
దెడు నవలదాను ॥ ౧౨॥ ఒక్కయధ్యాయమును భక్తియుక్తుడగుచు।
పరగనిత్యంబు బఠియించువాడు, రుద్ర । లోకమును బొంది, ప్రమ
థులలోననొక్క । డగుచు చిరకాలము వసించునచటదాను ॥ ౧౩ ॥
అనుదినము నెవ్వడధ్యాయమందు నొక్క । పాదమైనను బఠియించు
వాడు నిలచు । ధరను, మన్వంతరముదాక, పురుషుడగుచు ॥ ౧౪ ॥
ఏనరుడుతాను గీతలలోన, పదియు । నేడు, నైదైన, నాల్గైన, మూ
డునైన । రెండుశ్లోకములైనను, లేకనొక్క । శ్లోకమైనను, మరియర్థ
శ్లోకమైన । భక్తితోడను పఠియించువాడు నవల ॥ ౧౫ ॥ చంద్రలో
కముజేరి యాస్థలమునందు । నుండు పదివేలవర్షంబు లొప్పమీర ।
తపిలి గీతల జదువుచు, తనువుబాయు । నతడు దేవత్వమొందును,
నవలదాను ॥ ౧౬ ॥ గీతలను నభ్యసించెడు, పూతమనుజు । డుత్త
మంబైన ముక్తి, దానొందునవల, । మరియు గీతలస్మరియించి మర
ణమొందు । శుద్ధమానసు, డావల సుగతినొందు ॥ ౧౭ ॥ ఎవడు వి
నుచుండు గీతార్థమెపుడుదవిలి । యతడు వైకుంఠపదమొంది యచ
టదాను । దేలునానందమున, విష్ణుదేవుతోడ ॥ ౧౮ ॥ కర్మలన్నియు
జేయుచు కడగియెపుడు । ధ్యానమునుజేయుచుండు గీతార్థమెవడు।

యతఁడు భువిని జీవన్ముక్తుఁడౌచుఁ బరగి । పడయు దేహాంతమునందు
రమపదము ॥ ౧౯ ॥ భూభుజులు జనకాదులు, పూర్వకాల । మునఁ
నెందరో గీతల నాశ్రయించి । విగతపాపులై భువిలోన వినుతికెక్కి
పరమపదమును బొందిరి వారలంత ॥ ౨౦ ॥ ఈశుగీతల దాఁ బఠియించి
చి యనల । నెవఁడు మాహాత్మ్యమును పఠియింపకుండు । వానిపఠ
నంబు వ్యర్థంబు ఫలము శ్రమయె ॥ ౨౧ ॥ తవిలి మాహాత్మ్యసహిత
గీతలను నెవఁడు । తానుబారాయణమ్ముఁ జేయు తత్పరతను । పొందు
పూర్వోక్తఫలముల బొందు నరయు । నట్టియాతఁడు దుర్లభంబైన గ
తిని ॥ ౨౨ ॥

సూత—పరగ నా చేత జెప్పఁగబడినయట్టి । యీసనాతనమహాత్మ్యమెవ
డు తాను । శ్రీశుగీతల బఠియించి యిడియుఁజనువు । వాఁడు బొందు
ను పూర్వోక్తఫలములన్ని ॥ ౨౩ ॥

ఇది వరాహపురాణమందలి గీతామాహాత్మ్యము

సంపూర్ణం.



య్యో
ఆ

# శుద్ధపత్రిక.

---

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 24 | సంథుంబు | సంఘుంబు |
| 4 | 5 | బధులు | బంధులు |
| 18 | 19 | మరియునెవడే | మనుజుడాయె |
| ,, | 22 | పలుపుచుండు | పలుపునెవడు |
| 19 | 7 | క్షేద్రియ | క్షే త్రియ |
| 23 | 13 | రాత్మనుఖి | రాత్మనసుఖి |
| ,, | 16 | ఖిన్న | ఖిన్న |
| ,, | 17 | బ్రహ్మ | బ్రహ్మ |
| 31 | 3 | అస్తుడు | ఆప్తుడు |
| ,, | 4 | భజూ | భజి |
| 38 | 15 | చుద్రా | చంద్రా |
| 41 | 20 | నొుగ్రా | నొుక్రా |
| 44 | 6 | వాపించి | వ్యాపించి |
| 47 | 7 | మిటట | మింటి |
| 48 | 7 | యమునజే | యమునజే |
| 55 | 14 | లుగాన | లుంగాని |
| 56 | 10 | నింద్రింయం | నింద్రియం |
| 6. | 6 | ననన్యారభ | నన్నియారంభ |
| 64 | 17 | నవి । ప | నవి । వేకమును |
| ,, | 18 | క్రోధమును వేకమునుగి | క్రోధమునుగల్గి |
| 77 | 3 | యందు | యంబు |
| 79 | 10 | విత్యంబు | నిత్యంబు |
| 80 | 5 | కుడు | కుండు |